శ్రీరామచంద్రగ్రంథమాల - ప్రథమకుసుమము.

# శ్రీరామోద్యోగము.

(అయిదంకముల నాటకము)


గ్రంథకర్త

అమరాది వెంకటరంగాచార్యులు

అయ్యంగారు



మొదటికూర్పు 500 ప్రతులు.

గుంటూరు చంద్రికాముద్రాక్షరశాలయందు

ముద్రింపబడి

గ్రంథకర్తగారిచే

ప్రచురింపబడియె.

1936




[వెల రు 1-0-0

# కృతిసమర్పణము.



శా. 'గండా డొక్కని నిచ్చికొంటి సుతభి
క్షన్బెట్టు నీవే సమ
ర్థుండా వేంకటశైలనాథ!' యని యో
తోషప్రీతిఁ బూనంగ 'గా
గండా! నీకృప' యంచు నగ్గనిన భ
క్తాగ్రేసర న్మాతనా ('శ్రీ)
యాం(ఆం)డాళాంబ' స్మరించి యీకృతిని స
మ్యగ్భక్తి నర్పించితిన్.



# విజ్ఞప్తి



చదువరులారా !

వాల్మీకికృత శ్రీమద్రామాయణము ననుసరించి నాటకపంచకము రచింపఁదలంచినవానిలో నీ "శ్రీరామోద్యోగము" మూఁడవది. ఇది 1-10-'34 నుండి 20-11-'34 లోపుగా వ్రాయఁబడినది. ఇంతకు ముందుగనే శ్రీరామబాల్య, ప్రవాసములు ముద్రణమగులోపల మాటమాత్రమున దీనిని గ్రహించి దీనికి ఉపోద్ఘాతము వ్రాసిపంపిన 'క్రొక్కాఁడు' గ్రంథకర్తలగు నామిత్రులు జలదాంకి కృష్ణస్వామి శర్మగారికి నే కృతజ్ఞుఁడ.

దీనిముద్రణమున ప్రూఫులు శ్రద్ధగా సరిచూచి సామాన్యముగు శాలికను వారి కొసంగ దానిమొదల పుత్రికాప్రేమఁజేసి సర్వాలంకారయుక్తగా నాచేతికందించు నామిత్రులగు మహాశ్రీ పక్కి వేంకటసుబ్బారావుపంతులుగారికిని, బ్రహ్మశ్రీ చతుర్వేది అమరేశ్వరశాస్త్రులుగారికిని నాకృతజ్ఞతాపూర్వకసమస్కారశతంబులు చర్వితచర్వణంబులే.

శ్రీమద్రామాయణకథాశ్రవణకుతూహలులగు పాఠకమరాళములకు శ్రీరామచంద్రగ్రంథమాలాతృతీయపుష్పమును నీసరసవారియుక్తప్రాయనోపహారమును సమర్పించు

ఒంగోలు,
16-3-'36.

శ్రీవైష్ణవ, విద్వచ్చరణపరమాణువు,
ఆచారి వేంకటరంగస్వామి అయ్యంగారు.

# ఉపోద్ఘాతము



నంగవోలు పురవాస్తవ్యులును, గుంటూరుమండల దక్షిణభాగ స్థానిక పరిపాలనశాఖా కార్యాలయోద్యోగులును, గీర్వాణాంగ్లేయాంధ్రభాషాభినివిష్టులును, ధనుర్విద్యావిశారదులును, భాగవత శిరోమణులును, 'సింగరాద్రిమాహాత్మ్య' శ్రవ్యకావ్య, 'శ్రీరామ బాల్య' 'శ్రీరామప్రవాస' 'శ్రీరామోద్యోగ' 'శ్రీరామవిజయ' 'శ్రీరామప్రస్థాన' నామకదృశ్యకావ్యకర్తలును, మామక ప్రియ మిత్త్రులును అగు శ్రీమాన్ ఆదూరు వేంకటరంగస్వామి అయ్యంగార్లవారు రచించినట్టి దీనాటకము.

ఇందలి ప్రస్తావనలోఁ జెప్పఁబడిన 'రాయమూరు యుద్ధ నాటకమును మాని, పూర్వోక్తకావ్యములను వైష్ణవములనే ప్రకటించుటకు రచయితల భక్తియే ముఖ్యకారణము. విరచనకుఁగూడ నాభక్తియే కతము.

"శ్లో. భాస్వద్వంశవతంసకీర్తిరమణీరంగప్రసంగస్వన
ద్వాదిత్రిప్రథమధ్వని ర్విజయతే వల్మీకజన్మా మునిః
పీత్వా యద్వదనేందుమండలగళత్కావ్యామృతాబ్ధేః కియ
త్ప్రాక్కల్పం కవినూతనాంబుదమయీ. కాదంబినీ వర్షతి."

అను జయదేవవాక్యముబడి వెలువడిన యాంధ్రగ్రంథములలోఁ గవిగారి రామాయణ నాటకములు చేరుచున్నవి. ఆరూపకములలో శ్రీరామోద్యోగము మూఁడవది.

ఈనాటకములోని యితివృత్తము నాందియందుఁ బూర్ణముగా వివరింపఁబడియున్నది. నాయకుఁడు వాలిం జంపి సుగ్రీవుఁ బట్టాభిషిక్తు నొనర్చుటయు, నతనియాజ్ఞచే లక్ష్మణుఁడు ధన్వియై సుగ్రీవునిపై విజృంభించుటయు, సీతాన్వేషణార్థము వానరవీరులు వెడలుటయు,

అశోకవన విధ్వంసనంబును, లంకాదహనమును, వీరరసస్ఫోరకములుగా గ్రహింపఁబడినవి. కాని-చోఁ, బ్రస్తావనయందలి శరదృతు వర్ణనము సందర్భశుద్ధిం బొరయదు. కాఁబట్టి ఈనాటకమునకు అంగి వీరరసమని యుద్దేశింపఁబడినది. అందం దితరరసములును గలవు. ఇందుఁ గవనము ప్రాయికముగా నలఁతియలంతి తెనుఁగుఁబలుకులతోడఁ బేశలమై రసనిష్యందియై హిమవన్నగనిర్గతగంగావాహినివోలె సమలమై పఠితృలోకమున కానంద మొడగూర్చుచుండును. పండితులకుఁ గూడఁ గ్లేశావహమగు నిస్సారకవిత కాకరములైన దుష్టగ్రంథములు వెలువడు నీకాలములో నిట్టిగ్రంథములు పఠనీయములు.

ఆంధ్రభారతి కవిగారి యూడిగముఁబరిగ్రహించి వారికి ఇతోధికపాండిత్యమును, ఇతోధికయశమును బ్రసాదించుఁగాక.

వంగవోలు<br>20-12-'35

ఇట్లు,<br>జలదంకి కృష్ణస్వామిశర్మ.



## ఈనాటకమున వచ్చుముఖ్యపాత్రలు.



### 1వ యాంకము.

భిక్షుకుఁడు (హనుమంతుఁడు)
శ్రీరాముఁడు
లక్ష్మణుఁడు
సుగ్రీవుఁడు

### 2వ యాంకము.

ఇరువురు కపులు
జాంబవంతుఁడు
సుగ్రీవుఁడు
వాలి
హనుమంతుఁడు

### 3వ యాంకము

శ్రీరాముఁడు
లక్ష్మణుఁడు
అంగదుఁడు
తార
రుమ
సుగ్రీవుఁడు
హనుమంతుఁడు
కపి
వినత, సుషేణ, శతవలిను లు
జాంబవంతుఁడు
సంపాతి

### 4వ యాంకము.

హనుమంతుఁడు
లంకాధిదేవత
ఏకజట
ద్విజట
త్రిజట
రావణుఁడు
ధాన్యమాలిని
జానకి
ప్రహస్తుఁడు
ఇరువురురాక్షసులు

### 5వ యాంకము.

దధిముఖుఁడు
శ్రీరాముఁడు
సుగ్రీవుఁడు
హనుమంతుఁడు
లక్ష్మణుఁడు
జాంబవంతుఁడు
అంగదుఁడు
శరభుఁడు
మైందుఁడు
విభీషణుఁడు
సాగరుఁడు

నటి:- తమ యభిప్రాయమునుబట్టియు నామనోవృత్తినిబట్టియు శ్రీరా
మోద్యోగము ప్రదర్శింపుమందురా యేమి ?

సూత్రి:- ఆర్యా ! బాగుగ నూహించితివి. అట్లే యొనర్పుము.

నటి:- నాథా ! ఆనాటకమును రచించినకవినామ మెఱింగింపుఁడు.

సూత్రి:-

సీ. ఎవ్వాఁడు రచియించె నింపుమీఱఁ డిశయ్య రసముల్కుఁగా 'సింగరాద్రిమహిమ'
నెవ్వాఁడు కృతిఁజేసె హితకోటి మెచ్చఁగా "రాయచూర్యుద్ధంబు" రమణమించ
నెవ్వాఁడు విరచించె నిహపరసుఖదమౌ "శ్రీరామబాల్యంబు" చిత్రఫణితి
నెవ్వాఁడు వ్రాసె నహీనచమత్కృతి మాన్యమైనట్టి "రామప్రవాస"

ఆ. వె. మట్టిహాటతగోత్రుఁ డాదూరి వేంకటరంగనాథకవియె రసముగులుక
నుచితరీతి "రామునుద్యోగ" రూపకమును రచించినట్టి ఘనుఁడు తరుణి !

నటి:- ఓహో ! యీకవి మనకుఁ జిరపరిచితుఁడే. రసోల్లసితముగ
వ్రాసియుండును. సభ్యమనోరంజన మొనర్పకపోవదు లెండు.

సూత్రి:- ఇఁకనైన జాగొనరింపక యుచితఋతువర్ణనముతో నీప్రసం
గమును ముగించి ప్రయోగమునకుఁ గడంగుము.

నటి:- మహాప్రసాదము.

తే. గీ. పవనడింభు నుదంతప్రవాహనిహతి
కంఠగతమేఘపర్వతాక్రాంతి వాయ
కిలకిలని హసియించుసుగ్రీవముసను
గంటివే శరదాగ్రజు నగాగ్రమునను ?

(తెరలో)

ఎవఁడురా సుగ్రీవముఖోల్లాసమునకై నా వైరిఋతువును
గొండాడువాఁడు ?

సూత్రి:- ఆర్యా ! వర్షుఁ డాంజనేయభూమికాధారియయ్యు నైసర్గిక
శరదృతువైషమ్యము వెల్లడించుచు వచ్చుచున్నాఁడు. తడయఁ
జనదు. పద.

నటి:- నాథా ! మేఘగర్జనము వర్షహేతువై పరిణమించుఁగదా ?
సరియే. మన కెందులకు? పోవుదము. (నిష్క్రమింతురు)

ఇది ప్రస్తావన.

# ప్రథమాంకము



## 1. స్థలకము - పంపాసరోవరతీరము.

(తెర లేచి)

ఎవఁడురా సుగ్రీవముఖోల్లాసమునకై నా వైరిభూతుఁడును గాం డాడువాఁడు ?

గీ. ఆగుఁడాగుఁడు. పసవిడిచి సాగ యేమి
  వెంట సాఁగెను ? సుగ్రీవవిహితవచన
  రంగమున భయమేటికి ? రాము రాము
  స్వామిభక్తి కృత్తియు నాకసహ్యకంబె ?

హనుమంతుఁడు:- (ప్రేక్షకసూపమునకోఁ బ్రవేశించి) పిఱికిపంద లారా ! అంతభయ మేల? రాము ఎవరో శరదృతువన్న వ్యాజమున సుగ్రీవసంతోషము ధ్వనింపఁజేసి యేగిరి. ఇదియు శుభసూచకమే. ఆహా ! అధర్మప్రవర్తకుఁ డగువాలియనాదరణమున మా సుగ్రీవుని పరిస్థితి యెంతకష్టముగ నున్నది? ప్రియార్ధాంగి యగురుమను బాసి నిలువ నీడలేక యీమతంగమునియనుగ్రహంబున ఋష్యమూకంబున నుండుట తటస్థించినదికదా ? మా మంత్రిచతుష్టయ మన్యాయవానర పాలకునిరాజ్యంబున నుండుటకంటె సుగ్రీవానుసరణమే మేలని తలఁచి యీతని యనుసర్తులమై వచ్చితిమికదా ? ఇచ్చటనైనను స్వస్థత కుదురకున్నది. రుమావియోగదుఃఖంబునను వాలిభయంబునను మారాజునకు నిద్రపట్టుటలేదు. జాతీయాహారము లగునాకలంబులుకూడ రుచించుటలేదు. అతఁడట్లుండ మాకుమాత్ర మేమి సుఖము ? నన్నిపుడు చేరఁబిలిచి హనుమా ! పంపాసరోవరతీరమున నసమానతేజోవిరాజితు లగునిరువురుధానుష్కు లున్నారు. ఋష్యమూకంబు మతంగమునిశాపంబున వాలి కగమ్యమగుటఁ దన్ను, తన

యనుచరులను బోరిఁగొన వీరి నెవ్వారినో పంపెనని శంకించి తద్వృత్తాంత మెఱింగి వచ్చుటకై నన్నుఁ బంపె. స్వస్వరూపమునఁ బోవుట యుక్తమైనపని యనితలఁచి యీభిక్షుకరూపంబుఁ దాల్చివచ్చితిని. ఈ శూరవరుల దరిసి మృదువచనరచన వారియుదంత మెఱింగి సందర్భానుసారముగఁ బ్రవర్తించెద. వార లేదో మాటలాడుచున్నారు; వినవచ్చునేమో యీమఱుఁగున నుండి యాలించెద (మఱుఁగునఁ దాఁగును)

(ఖిన్నులగు శ్రీరామలక్ష్మణులు మెల్లగా నడచుచుఁ బ్రవేశించి కూరుచుందురు.)

శ్రీరాముఁడు:- (విషాదముతో)

సీ. నీరజమా! కంటె నీరజాతాస్యయౌ మాసీత డాచినమఱుఁగు నెలవు ?
తిలకంబ! మృగమదతిలకను గాంచితే మాసీత డాచినమఱుఁగు నెలవు ?
చంపక! కాంచితే చంపకనాసయౌ మాసీత డాచినమఱుఁగు నెలవు ?
మాలతీ! కాంచితే యాలతాసమదేహ మాసీత డాచినమఱుఁగు నెలవు !

గీ. అల్లిబిల్లిగ నల్లినమల్లికాల! తా! విలోకించితే ప్రాకుతావులందు
ధవళిమా నీదుమొగ్గల నపహసించు। రదనములనొప్పు జానకీరామఁ గని ?

సీ. భ్రమరంబ! కానవే భ్రమరసన్నిభవేణి మాసీత వసియించుమాటు నీవు ?
హరిణంబ! కానవే హరిణచకితనేత్ర మామైథిలి వసించుమాటు నీవు ?
మృగరాజ! కానవే మృగరాజమధ్యయౌ మాజానకి వసించుమాటు నీవు ?
కరిణి! కాంచితివటే కరిణీంద్రసమయాన మాభూమిజ వసించుమాటు నీవు ?

గీ. కమఠమా! నీటిలోఁ జూడఁగాంతుగాదె? కమలపాద నయోనిజఁ గాంచినావె
యీసరోవరమున డాచెనేమొ యసురుఁ డక్కటా! యొక్కరేని మాటాడరేమి?

సీ. పికకాంత! నినుఁబోలు పికవాణిఁ గాంచితే నాదువల్లభను జానకి నెందేని ?
శారికా! కంటివే శారికాకలకంఠి నాదువల్లభను జానకి నెందేని ?
చక్రవాకమ! కంటె చక్రవాకస్తని నాదువల్లభను జానకి నెందేని ?
శుకసతి! నినుఁబోలు శుకనాసఁ గంటివే నాదువల్లభను జానకి నెందేని ?

గీ. స్థావరములార! మీపజ్జఁ జనఁగలేదె। మాదుమైథిలి? యోజంగమంబులార!
మీరు చరియించువసతుల? మీదుకంటఁబడఁగలేదె మావైదేహి పలుకరేమి?

తమ్ముఁడా! ఏమి చూచుకొని యూరడిల్లుదు? వనంబునకు నను వెంబడింపవలదని చెవిసాటి చెప్పినను నాయందలి యవ్యాజానురాగంబుకతంబున సకలరాజభోగంబులఁ దృణప్రాయముగఁ

దలఁచి 'నాథా! మీతోడిదే లోకముగాని మీకు కానలపాలై కష్టంబులఁ గుడుచుచుండ మీసహధర్మచారిణి నగు నాకుమాత్ర మీరాజ్యసౌఖ్యము లేల' యని యెన్నియో విధముల నచ్చఁజెప్పి నన్ననుసరించి వచ్చిన నాకల్పకము, నాసౌఖ్యనిధానము, నానయనోత్పలశశి, నాపెన్నిధానము వేయేల నాసర్వస్వ మగు ననుంగుజానకిఁ గోలుపోయి యెట్లు సహింపఁగలనో నాకేతోఁపకున్నది. 'నిముసము నిన్నెడఁబాయఁజాలను నాథా!' యని నుడివిన నాప్రియప్రాణము సంగతి విస్మరించుటెట్లు? జానకీ! జానకీ! మనయనురాగంబు తుల్యంబుకాపున నేను స్మరించవలసియున్నను నీవు దరిలేకుంట ప్రస్తుతము నానోరినుండి వెలువడిన వాక్యంబులు పిచ్చివాని ప్రలాపంబు లగునేమోయని నా నాల్కకు నేనే బుద్ధిచెప్పుకొనుచున్నాను. అక్కటా! వైదేహీ! మనసుఖసాధనము లన్నియు క్షణమాత్రముగఁ బరిభ్రమించినవాయని తోఁచుచున్నది. నిన్ను విరాధశూర్పణఖాది రాక్షసుల బారినుండి రక్షించి 'యీనఁగాచి నక్కలపాలు గావించినట్లు' నేఁటికి రావణునిచేతి కప్పగించినట్లాయెనదికాదా? ఏమందును? మనసుఖమంతయుఁ గర్మవిపాకమున క్షణములో స్వప్నగతవృత్తాంతమైనదికదా? హా! జానకీ! నీదరహాసభాసితముఖచంద్రుఁజూచుభాగ్య మీ భాగ్యహీనుని కున్నదో లేదో. (అని స్పృహదప్పి నిలుచును.)

లక్ష్మ:- అగ్రజా! సర్వజ్ఞుఁడ వగునీవే యీరీతి వియోగదుఃఖాంబుధిమగ్నుఁడవైన నిన్నోదార్ప నెవ్వరికి శక్యము? దుఃఖసమయమునఁ బాతాళమునకుఁ గ్రుంగిపోవుటయు సంతోషతరుణమున నాకసముఁ దాఁకుటయు ధీమంతులలక్షణము కాదని దేవర మాబోంట్ల కెన్నిమార్లు ముందలించితిరి? రావణునితోఁ బ్రత్యక్షముగఁ బోరి దివంబునకేగిన జటాయువువలన సీతాపహర్త రావణుఁడనిమాత్రమే తేటపడెను. వానియునికిగాని యాదేవిగారిని దాచినచోటుగాని యెఱుకపడకున్నది. తమచే శాపమోక్షముఁ జెందిన కబంధుఁడు నుడివినవిధమున సుగ్రీవుని చెలిమి యొనర్చి

కార్యము సాధింతము. వగపు మానుఁడు. ఆదేవిజాడ యెఱింగితి మేని.

తే. గీ. భూమిగర్భంబునందో యంబుధియందో
గగనభాగంబునందో, భూగతలమందో
చొరఁగఁ జనుఁగాక రావణు సుగుఁగఁజేసి
సీతఁ దెచ్చి మీ కర్పణ సేయువాఁడ.

భిక్షుకుఁడు:- (ప్రవేశించి స్వగతము) ఇప్పటి వీరిసంభాషణమువలన నెఱింగినంతమట్టుకు వీరు వాలిచే సుగ్రీవనభార్గము హరింపఁబడినట్లు కాని వానికై వెదకుచున్నట్లుగాని ప్రసంగింపఁబడలేదు. ఇంతేగాక కబంధునిచే సుగ్రీవమైత్రిఁ జేసికొనుమని నుడువఁబడినట్లు ప్రసంగవశంబున నెఱిఁగితి. ఇట్టి భాషణంబులు సుగ్రీవునకుఁ గొప్పపట్టు యాతనికి శుభసూచకమని తోఁచుచున్నది. నే నిజరూపంబున దర్శింతునా ? (యోచించి) వీరి చరిత్రము సాంతంబుగ నెఱుఁగు వఱకు బ్రచ్ఛన్నవేషంబున నుండుటయే యుక్తము. వీరు శత్రువులా యనుసందియము తీఱకున్నది; కావునఁ బోయి వారిని సందర్శించెద. (శ్రీరామలక్ష్మణులకు సాష్టాంగదండప్రణామము నాచరించి నిలువఁబడి) రాజకుమారపుంగవులారా! సకలరాజలక్షణలక్షితుల రగు మీ రెవరు ? ఆవాస మెయ్యది ? నామంబు లెవ్వి ? సర్వసర్వంసహాతలరాజ్యపూజితుల రగుమీరలు జటావల్కలధారులై, ధనుర్బాణకృపాణపాణులై యీయరణ్యసీమలఁ దిరుగఁ గారణమేమో నే వినఁదగిన నెఱిఁగింపుఁడు ? ఈవన్యమృగచయము సౌందర్యభీమంబు లగుమీవిగ్రహంబులఁ జూడఁగాంచినదిమొదలు కలగుండువడి చేష్టలు దక్కి యున్నవి. మీవచోమృతాభిషేచనంబునఁగాని కొంతవఱకైన సేదదేఱఁగనవు. అభ్యంతరములేదేని మీచరిత్రము సాంతముగ వినవలతు. నే నీఋష్యమూకవాసుఁడను, సూర్యపుత్రుఁడును, వానరనాథుఁడు నగుసుగ్రీవుని సచివులలో నొకఁడను. వాయుపుత్రుఁడను. హనుమంతుఁడ. యుష్మత్సందర్శనభయభ్రాంతుఁడైనసుగ్రీవునిపనుపున మీయుదంత మెఱుఁగ

నివ్విధి భిక్షుకరూపంబున వచ్చినాఁడను. తమచరిత్ర మెఱుంగఁ బ్రార్థించుచున్నాఁడ.

శ్రీరా:- సౌమిత్రీ! చూచితివా ?

గీ. సెమకునట్టిలతిక పాదనికటమున నె
కాంచఁబడినట్లు సుగ్రీవుఁ గాంచఁబోవు
మనకుఁ దన్మంత్రిదర్శనం బౌనరు టెంత
యని సంతోషవారిధిలోనఁ దేల్చె.

ఇది శుభసూచకము. ఈహనుమంతునిశబ్దశుద్ధి నవవ్యాకరణ వేత్తయు వేదాధ్యయనపరాయణుఁడని వేనోళ్ళఁ జాటుచున్నది. కావున సందేహింపక మాచరిత్ర మీమంత్రిశేఖరునకు నెఱుఁగింపుము. ఇట్టిమంత్రిసహాయములేకదా సఫలీకృతసకలయత్నులు ?

లక్ష్మ:- జగత్ప్రాణపుత్రా! సుగ్రీవసచివా! వినుము. మేము కోసలాధీశ్వరుఁ డగుదశరథమహారాజు పుత్రులము రామలక్ష్మణు లనువారము.

హను:- (పరమభక్తిసంతోషములతో)

గీ. అంజనాదేవి మాత బాల్యంబునందు
దశరథాత్మజు రాముని దెలుపు చునుచు
రామతత్త్వంబు నెఱిఁగించెఁ బ్రేమమీఱ
రాము నాత్మాభిరాముఁ జేరఁగంటి.

ధన్యోస్మి. ధన్యోస్మి. కృతార్థోస్మి. (శ్రీరామునకు సాష్టాంగదండప్రణామ మొనర్చి లేచి చేతులు కట్టుకొని నిలుచుండును)

లక్ష్మ:- మాతండ్రికి మేము నలువురుసుతులము; శ్రీరామ, భరత, లక్ష్మణ, శత్రుఘ్నులము. జనకాజ్ఞానుసారముగ నగ్రజుఁ డగు శ్రీరాముఁ డరణ్యవాస మొనర్ప నచ్చెను వారివెంట మావదినె జానకీమాతయు ననుఁగూడ వచ్చితిమి. భరతుఁ డయోధ్యారాజపదమందుఁ గలఁడు. మేము దండకాటవి నున్నతఱి రావణుని సోదరి యగుశూర్పణఖ మొదట నియ్యనఘుని తదుపరి నన్ను

మోహించి నిరాకరింపఁబడి ముక్కు చెవులకుఁ జెడె. ఆవృత్తాంత
మది తమవారి కెఱింగింప ఖరదూషణాదులు పదునాల్గువేలమంది
మాయగ్రజు నొక్కని డీకొని మడిసిరి. తరువాత మాయామృగ
రూపధారి యగుమారీచద్వితీయుఁడై రావణుఁడు మమ్ము మోసగించి
జానకీమాతను మింటఁ గొనిపోయెనఁట. అసహాయ యగుజానకిని
రావణుఁడు వినువీథిఁ గొనిపోవ జటాయువు వడ్డపడ నాతని ఱెక్కలఁ
దునిమె. మే మాతనివలన రావణుఁడు జానకి నెత్తుకొని దక్షిణాభి
ముఖుఁడై పఱచెనని విని యాతఁడు చావ నగ్నిసంస్కార మొన
రించి వచ్చుతఱి కబంధుఁడనురాక్షసుని చేతఁ బట్టుపడి యాతనిఁజంపి
భస్మంబొనరింప నాతఁడు శాపమోక్షణ మొంది సుగ్రీవసాయముఁ
జెంద మేలయ్యెడినని చెప్పి చనె. తద్వచనానుసారము వచ్చు
చుండ నీదర్శన మబ్బె. మాకును సుగ్రీవునకును మైత్రియొనర్చి
పుణ్యముఁ గట్టుకొనుము.

హను:- ధన్యోస్మి. మహాప్రసాదము, రాజకుమారా! ఆతఁడును
నగ్రజుఁడగువాలిచే ననాదరింపఁబడి భార్యయగు రుమను బాసి,
యుండ నీడ లేక, మతంగముని శాపంబున వాలి కగమ్యంబగు
ఋష్యమూకముఁ జేరియున్నాఁడు. తుల్యవ్యసను లగునిరువురిసఖ్య
మన్యోన్యకార్యసాధక మగుఁగాక. ఇంకను నా కీభిక్షురూపమేల?
(స్వస్వరూపంబుఁదాల్చి)

క. రం డధిరోహింపుఁడు, తా
ర్క్ష్యుండు రమాపతిని మోయునోజను గొని యా
కొండసఁ గలసుగ్రీవుని
దండ నిలుపువాఁడ వేగఁ దరలుం డిపుడే.

(అని మోకరింప శ్రీరామలక్ష్మణులు భుజస్కంధములపై నధి
రోహించెదరు.)

(యవనిక జారును)

## 2. స్థలకము — ఋష్యమూకపర్వతము.

(ధనుర్బాణకృపాణపాణులై శ్రీరామలక్ష్మణులు నిలిచియుందురు)

లక్ష్మ:- హనుమంతుఁడు మ మ్మిట డించి సుగ్రీవు నిప్పుడే పిలుకొని వచ్చెదనని చెప్పివెళ్ళెను. ఇంతకు వచ్చుచుండును.

సుగ్రీవుఁడు:- (ప్రవేశించి స్వగతము) దివ్యసుందరవిగ్రహులు, ఆజానులంబితబాహులు, విపులవక్షులు, సింహమధ్యావలోకనులు, పుండరీకాక్షులు, శౌర్యోల్లసితమూర్తు లగువీర లయోధ్యాధీశ్వరుఁ డగుదశరథపుత్త్రులఁట. ఈయసహాయశూరుల దర్శించి వీరిసాయమున నాయన్న యొనర్చినపరాభవమునకుఁ బ్రతీకార మొనర్పఁ జూచెద. (ముందునకుఁ బరిక్రమించి)

ఉ. భానుసుతుండ, శక్రసుతుభ్రాత సధర్మపథానువర్తిఁ, గా
జ్ఞానవిహీనసోదరుఁడు జాయ హరింపఁ బురంబుఁ బాసి పె
న్దీనత నీనగానఁ బరిదేవనము న్బొనరించువాఁడ. నో
భానుకులావతంసమ! కృపామతి, దీను ననుగ్రహింపవే.

(నమస్కరించును)

శ్రీ:- (స్వగతము) చింత విడిచినను పులుసు పూర్తిగ విడుఁగలేదు. దీనస్థితియందున్నను రాజస మించుక గోచరించెడి. క్రమముగ నడిపెద. (ప్రకాశముగాఁ జేయి పైకెత్తి)

గీ. అభయ మిడినాఁడ నబ్జహితాత్మజాత!
నేఁడు మొదలు ని న్గమ్ముని జాడఁ జూతు
లక్ష్మ:- అగ్నికల్పక నైనరామావనీశుఁ
జేరి సుగ్రీవ! కోర్కులఁ జెందితౌర!

సుగ్రీ:- అనుగృహీతోఽస్మి. రామచంద్రమూర్తీ! నాస్నేహముఁ జేయ నిచ్చకల దేని నాచేతఁ జేయివేయుము. (చేయిఁ జాచును)

శ్రీ:- సుగ్రీవా! నీయిష్టానుసారమే. (చేతిలోఁ జేయివేయును)

హనుమంతుఁడు:- (శుష్కకాష్ఠములతోఁ బ్రవేశించి మంటఁజేసి) ప్రభువరులారా! మీమైత్రి యీయగ్నిసాక్షికముగా నొనర్చికొనుఁడు.

శ్రీరా:- వాయుపుత్రా! ఇదిగో నాశపథము,

గీ. పావనుండైనయట్టిపావకుఁడు సాక్షి
గాఁగ సుగ్రీవుఁ బ్రోచెదఁ గపికులేశ!

సుగ్రీ:- అనలుసాక్షిగ రామచంద్రావనీశ
కార్యమొనరించువాఁడ నిక్కముగ హనుమ!(నిష్క్రమించి యొకపుష్పితశాఖను దెచ్చి శ్రీరామున కాసనముగా నిడి) రామచంద్రా! యిట నధివసింపుము. (శ్రీరాముఁడు కూర్చుండఁ దాను బ్రక్కనఁ గూర్చుండును).

శ్రీరా:- (స్వగతము) ఇతఁడు నన్ను సమానరాజమాత్రునిగఁ బరిగణించి నన్నుమాత్రము గౌరవించి పరమభక్తుఁడగు ననుజుని సంభావింపఁడయ్యె. ఈభాగవతాపచార మచిరముగ ఫలదాయియగుఁగాక.

హను:- (నిష్క్రమించి మఱియొకపుష్పితశాఖను గొనివచ్చి యట నుంచి) లక్ష్మణప్రభూ! ఇట నధివసింపుఁడు. (లక్ష్మణుఁడు కూర్చుండును).

లక్ష్మ:- హనుమా! ఇటఁ గూరుచుండుము.

హను:- భాగ్యము. (లక్ష్మణునివెంబడి కూర్చుండును.)

శ్రీరా:- సీతావియోగ మెంతదుర్భరముగ నున్నది?

గీ. ప్రేమ కపరావతారమై వెలయునట్టి
జానకినిఁబాసి యెవ్విధి సైచువాఁడ!
రావణాకృష్టశోకభారానతాస్య
పటమువలెఁ గట్టెదుట ప్రేలుభాతిఁ దోఁచు.

మిత్రమా! రావణనిలయంబుగాని యాతనిబలచరితములేవేని నీకుఁ దెలియునా?

సుగ్రీ:- కొన్ని దినములకిగ్రిందట దుఃఖించుచున్న యొకవనితను గొని రావణుండు దక్షిణాభిముఖుండై చేదలఁబఱువఁ గంటిమి. ఆసాధ్వి మీవల్లభ జానకీదేవి గానోపునని యిప్పు డూహ జనించెడి. (హనుమదిక్కై) పావనీ! ఆనాఁ డావనిత కొన్నియాభరణంబులఁ జీరచెఱఁగున ముడిచి మనచెంగట వైచెఁగదా? వానిఁ దీసికొని రమ్ము.

హను:- చిత్తము. (నిష్క్రమించి సొమ్ములమూటతోఁ బ్రవేశించి సుగ్రీవున కందిచ్చును)

శ్రీరా:- తమ్ముఁడా! ఈచీర జానకి ధరించినదేకదా? ఆనవాలు పట్టఁ గలవా?

లక్ష్మ:- అగ్రజా! అట్టులే తోఁచెడినిగాని యట్టిచీర లింకెవ్వరికి నుండఁగూడదా?

శ్రీరా:- తమ్ముఁడా! ఉండవచ్చునుగాని రావణుఁడు జానకింగొని దక్షిణాభిముఖుండై తన్నుఁ బడఁగొట్టి యేఁగెనని జటాయువు చెప్పె. మింట రావణద్వితీయయై యేఁగునొకకాంత చీరచెఱఁగున ముడిచి పడవైచినభూషణంబులని సుగ్రీవుఁడు నుడువుటచే నట్లూహింపవలసె.

లక్ష్మ:- అగ్రజా! ముంజేతికంకణమునకు ముకురమేల? మూట విప్పిన నంతయుఁ దేటవడునుగదా?

శ్రీరా:- సుగ్రీవా! ఆమూట విప్పుము.

సుగ్రీ:- చిత్తము. (అని మూట విప్పి యెదుటఁబెట్టును)

శ్రీ:- సౌమిత్రీ! ఈభూషణములు మీవదినవి కావేనా? గుఱుతింపఁ గలవా?

లక్ష్మ:-(ఊర్ధ్వదేహభూషణంబుల నొక్కొకదానిని దీసి వేఱుగాఁబెట్టి) అగ్రజా! వీని నన్నిఁటిని నేఁబోల్పఁజాల. కాని

గీ. అనుదినము భక్తి మాతృపాదాంబుజాత
వందనం బాచరించెడిపట్ల నాకుఁ

చిరపరిచితము లగుచు సుశ్రీ వహించు
నూపురంబులు భూమితనూజ వౌను.

శ్రీ:- జననీకృతపరవనితాలోక! సుశ్లోకా! లక్ష్మణా! భూషణంబుల గుర్తించుటలోఁగూడ నీవం తఱిరమ్యముగ సమర్థించితివి. (భూషణములఁ బరిశీలించి)

గీ. కంఠహారంబులును హస్తకంకణంబు
లల్లజానకివే సందియంబు లేదు
(భూషణములపైఁ జేయినైచి స్పర్శసుఖము నటించుచు)
భూషణంబులఁ గనుట సౌమ్యంబుల ధరించు
మైథిలిని గన్నగతిఁ బొంగి మానసంబు
చింతజలనిధి తోషవీచికల దేపె.

సుగ్రీ:- మహాప్రభూ! రామచంద్రమూర్తీ! అచిరంబున మీదుఃఖ జలనిధి సంతోషపారావారంబుగ మార్చెద. నామనవిఁ బ్రత్తిగింపుఁడు.

శ్రీరా:- (ఊరడిలి) సమానదుఃఖుండ నే నొక్కఁడ నూరడించుకొనకుండిన మనల నాశ్వాసింపవా రెవరు కలరు? కానిమ్ము. నీచరిత్రము మనహనుమంతునిచే సాంతముగ వింటిని.

శ్రీ:- సుగ్రీవా! భయ ముడుగుము. వాలి యెంతటిశౌర్యవంతుఁడైనను సజీవభ్రాతృభార్యాహరణమహాపాతక హరిస్వీకృతాయుష్కుఁ డగుట వధార్హుఁడయ్యె. అచిరంబున నాతని సంహరించి నిన్ను రుమాసహితవానరరాజ్యపట్టభద్రు నొనర్తును.

హను:- లక్ష్మ:- తథాస్తు. తథాస్తు.

శ్రీరా:- సుగ్రీవా! హనుమంతునివలన నాచరిత మింతకుముందే యెఱిఁగియుంటివికదా? రుమావియోగదుఃఖితుఁడవౌ నీవు నా జానకీవియోగంబు పిష్టపేషణప్రాయమేకదా?

సుగ్రీ:- ప్రభూ! వర్షాకాలానంతరము నాయనుచరులగుకపులఁ బంపి జానకిజాడ నారసి తగుప్రయత్నముఁ జేయుదము. చింతఁ

దక్కియుండెడు. ఈమహాపర్వతాగ్రమున వాలిరూపువర్ణింపితిమా సర్వవానరభల్లూకసైన్యములు మసలుచున్నవి మెలఁగు. అప్పు డకార్య మింకను సులభము. వాలి నామాత్రుఁడని తలఁపకుఁడు.

గీ. గ్రావములలీల నమ్మునఁగాయ లాగు
మూలయుతముగ వృక్షము ల్బణికిసైచు
సాంధ్యకాల్యంబులకుఁ జతుర్గలదిశలకుఁ
జనెడు; నాతని బల మెన్న శక్యమగునె ?

దేవరశౌర్య మెఱుంగని యూరకించిన్నినసందియము వారఁ బ్రార్థించుచున్నాఁడను. శ్రీరామచంద్రప్రభుమూర్తి యాతఁడు యోజనపర్యంతము నింట పీచివైచినదుందుభికళేబర మిచ్చుటనే కలదు. హనుమా! ప్రభువుల కావును దుందుభికంకాళము చూపుము.

హను:- స్వామీ! చిత్తము. ఇచటనే కలదు.

శ్రీ:- సుగ్రీవా! నీసందియము తీర్తు. (అని కాలఁదన్నఁ గంకాళము తెరలోఁ బడును.)

హను:- ఆహాహా! ఆకళేబరము మింటికెగసి పిల్లలాడుబిల్లంగోడువలె యోజనముదూరమునఁ బడినది. స్వామిపాద మెంతనొచ్చినదో? (అని పాదంబుఁబట్టి యొత్తుచు)

సుగ్రీ:- (రికటఁగొట్టి యసంతృప్తిఁజూపుచు)

లక్ష్మ:- సుగ్రీవా! ఏమి సందేహాస్పదముగాఁ జూచుచున్నావు?

సుగ్రీ:- లక్ష్మణప్రభూ! ఏమియును లేదు. తొల్లి వాలి నసారక్త మాంసయుక్తం బగుదుందుభికళేబరమును సంగ్రామానంతరము చేత పీచివైవ నింట యోజనమేఁగి యుడ్చఁబడియె. ఇప్పుడు రక్తమాంసవసాహీన మగు నస్థికము ప్రభువుపాదఘాతంబున యోజనపర్యంతమే యేఁగినది.

హను:- సుగ్రీవమహారాజా! హస్తపాదాంతరము లేదా? రెంటను దుల్యంబులేయని నాయుద్దేశము.

శ్రీ:- హనుమా! ఆగుమాగుము. సుగ్రీవా! నీసందియము తీఱు టెట్లో చెప్పుము.

సుగ్రీ:- ప్రభూ! క్షమార్హుఁడ. వాలి యనుదినముఁ దన ప్రాణంబుల గుప్తపరచినయీసప్తసాలముల వంచి వానిని జూచి మరల వదలుచుండును. బాణఘాతంబున నొకసాలముఁగూల్చిన వాలికి దీటగుదురు.

శ్రీరా:- రామబాణవేగముఁగూడఁ జూతువుగాక. (అని యెక్కుపెట్టి బాణము వదలి సప్తసాలముల నొక్కపెట్టునఁ గూల్చును.)

హను:- సప్తసాలము లొక్కపెట్టునఁ గూలినవి. ఆశర మవ్వలికొండ దూఱి భూమిఁదొల్చి వెడలి వచ్చి దొనఁజేరెను. ఆహాహా! అమానుషశక్తి! అసమానశౌర్యప్రదర్శనము! ధన్యుల మైతిమి. ధన్యుల మైతిమి.

సుగ్రీ:- (సాష్టాంగదండప్రణామ మొనరించి లేచి) అనుపమాన శౌర్యా! పరాక్. రఘుకులాబ్జభాస్కరా! పరాక్. తమశౌర్యము పరీక్షింపఁ దెగించినందులకు దాసుఁడు క్షమింపవేఁడుచున్నాఁడు.

గీ. శౌర్యవిజితబ్రహ్మాండాయ శరణు శరణు
సమదదైత్యేభహర్యక్ష! శరణు శరణు
సంస్కృతపతంగరాజాయ! శరణు శరణు
జానకీనాథ! శ్రీరామచంద్ర! శరణు.

(పునః ప్రణామ మొనర్చును)

శ్రీరా:- సుగ్రీవా! లెమ్ము. లెమ్ము. ఇందు నీయపరాధ మేమియు లేదు. సంశయవిచ్ఛేదన మొనర్చుకొనుట లెస్సకదా?

సుగ్రీ:-(స్వగతము) ఇఁక వీరిసాయమున వాలిని గిలిని గేళిని గూల్పఁ గలను. ఇఁక నాకేమికొదువ?

హను:-ఉత్సా. సాలసప్తకంబు నేకసాయకానఁ గూల్పఁగా
జాలు మేటిశౌర్యవంతు సఖ్యమబ్బెఁగా బళా!

(అని గంతులు వేయును)

సుగ్రీ:- వాలి నేలఁ గూలనేయ భాగ్యమొక్కొ నాకిఁకన్ ?
లీల లీలఁ దీఱ్తు నిఁక నలేఖ్యమా జవంబునన్.
(అని నాట్యము చేయును)

లక్ష్మ:- సుగ్రీవహనుమంతులారా! గంతు లిడుచున్నారే ? ఆగుఁ డాగుఁడు.

సుగ్రీవ, హను:- (గంతులు చాలించి వచ్చి కూరుచుందురు)

సుగ్రీ:- నేటికి సనాథుఁడనైతినని సంతసము వొడముచున్నది. మహాప్రభూ! వాలినిఁ దాకి గెల్చు నుపాయంబు సెలవిండు.

శ్రీరా:- సుగ్రీవా! లెమ్ము. ఇప్పుడే కిష్కింధకేగి భుజాస్ఫాలన మొనర్చి వాలిని యుద్ధమున కాహ్వానింపుము. శౌర్యధనుఁడౌట నతఁడు వెనుదీయక వచ్చును. మీ రిరువురును బోరుచుండుఁడు. నేను సమయ మరసి వాలి బాణనిహతు నొనర్చి యుక్కడంతు.

హను:- స్వామీ! పథకము బాగుగఁ గుదిరినది. మహాప్రభునాజ్ఞాను సారమే వర్తింతుము.

శ్రీరా:- సుగ్రీవహనుమంతులారా! పయనము గండు.

సుగ్రీ:- భాగ్యము. వాయుపుత్రా! తక్కినసచివులతోఁగూడ రమ్ము

హను:- చిత్తము (నిష్క్రమించును)

లక్ష్మ:- అగ్రజా!

క. సురపతిసుత పాపతమో
హర మగుశ్రీరామచంద్రునస్త్రద్యుతికిన్
దిరమయి మేఘవిదారణ
పరు ఖరకరుఁ గంటె యపరపర్వతశిఖరిన్ ?

శ్రీరా:- సంధ్యాకాల మగుచున్నది. కాల్యంబులఁ దీర్చి యిప్పుడే యేగుదము.

సుగ్రీ:- లక్ష్మ:- చిత్తము.

(యవనిక జాఱును)



శ్రీ

# శ్రీరామోద్యోగము

## ద్వితీయాంకము.

1. స్థలము. (ఇద్దరు కపులు ప్రవేశింతురు.)

1 కపి:- సోదరా ! మనసుగ్రీవమహారాజుగారిగతి యేమిట్లయ్యెనవిరా ? ఏదో యాకలములఁదిని ఋష్యమూకమునఁ బడియుండిన వాలికి దుర్నిరీక్ష్యుండై యుండియుండునుగదా ? చావుదప్పి కన్ను గొట్టి వోయి యావాలి తమ్మునినిగని పెక్కువటికుఁ దక్కువబలముఁ జూపుట మానఁడయ్యెఁగదా ? శ్రీరాముఁ డిట్లు మోసముచేయుటకుఁ గారణమేమో నీ కేమైనఁ దెలియునా ?

2 కపి:- అన్నా ! తెలియకేమి ? సర్వము నెఱింగివచ్చినాఁడను.

1 కపి:- తమ్ముఁడా ! ఈగుట్టెట్లుఁ గనఁగలిగితివి ?

2 కపి:- చెప్పెదనంతటిలోననే యూపిరిపుచ్చుకోనీయవా యేమి ? స్వస్థుఁడవై కూర్చుండుము. చెప్పెదను.

1 కపి:- కూర్చున్నారా నాయనా ! చెప్పు మింక.

2 కపి:- రక్తసిక్తాంగుఁడై మనమహారాజు పర్వత మెక్కుటయు వాలి యంతమట్టున కాతనిఁ దఱిమి మరలి చనుటయు మనమిరువురముఁ జూచినవిషయమే కదా ?

1 కపి:- అగును. అంతవఱకు నే నెఱిఁగినదే. ఆపల ?

2 కపి:- మహారాజు త్వరలోఁ బ్రక్కన నున్న నన్నుఁ గూడఁ జూడక యుద్వేగంబున గుండెచేతఁబుచ్చుకొని 'బ్రదుకుజీవుఁడా' యని

కొండ యెక్కెను. వారిపరిస్థితిఁజూచియు నాపట్టున నూరడింపఁ బోయినఁ గృహ్యుఁడును, దుఃఖితుఁడైనయాతనిమనోభావ మెట్లుండునోయని కొంతవడి జాకి కర్తవ్యతామూఢుఁడనై కూరుచుంటిని. మఱియొకగడియలో హనుమల్లక్ష్మణసమేతుఁడై శ్రీరామచంద్రమూర్తి సుగ్రీవుఁడున్న నెలవునకుఁ బోవుటఁజూచి వారికి నమస్కరింప నేల యాచోటనుండెదవని ప్రశ్నించిరి. నేను వారితో వారికొఱకై యెదురుచూచుచుంటినని చెప్పి వారల వెంబడించితిని.

1 కపి:— తరువాత?

2 కపి:- శ్రీరామునిమోమున నొకవిధమగు వైవర్ణ్యమును హనుమంతునిమోమునను విచారమును గూడఁ బొడగంటిని.

1 కపి:- [illegible]?

2 కపి:- దానికారణ మూహించుకొనవలసినదేకదా ? మెల్లమెల్లగ మేమందఱము సుగ్రీవుఁ డున్న నెలవుఁజేరితిమి. కొండమీఁదినుండి సెలయేఱ్ఱపగిది నాపాదమస్తకము స్రవించురక్తధారలతో నా మహారాజు నేలమీఁద పడియుండి దీర్ఘనిశ్వాసంబుల బిట్టువిడుచుచుండె. కరుణార్ద్రహృదయుండగుహనుమంతుఁడును నేనును ఆర్ద్రవస్త్రంబున నారక్తధారలఁ దుడిచి సేదదేర్చితిమి. ఆమీఁదఁ గొంతవడికి నాతఁడు స్వస్థుఁడై శ్రీరాము నుద్దేశించి యిట్లు పలికె. "అసహాయశూరా! నియెడ నే నేమిద్రోహ మొనర్చితిని? నాయెదుట సప్తసాలంబుల నొకశరమునఁ గూల్చిన వాఁడవు సన్నిహితంబున వాలి నలినులియొనర్చుచుండ మిన్నకుంటి వేమి ? వాలిని నేను జూపనని మొట్టమొదటనే చెప్పియుండినఁ గచ్చెకుఁగాలుద్రవ్వి యిట్టిచావుదెబ్బలపాలై యుండనుగదా ? మహాత్మా! ఇట్లేల యొనర్చితివయ్యా? నీప్రవర్తనము నా కగమ్యముగ నున్నది."

1 కపి:- సోదరా! అందులకు శ్రీరాముఁ డేమిప్రత్యుత్తరమిచ్చెను?

2 కపి:- అందులకు శ్రీరాముఁ డిట్లనియెను. "సుగ్రీవా ! మీరిరు

వురు పోరునెడల రూప, శౌర్య, స్వనంబుల యుద్ధనైపుణిని నొకరి
కొకరు తీసిపోవక పోరుచుంటిరి. మీరిరువు రభేదప్రతిపత్తినుండుట
నాతూష్ణీంభావకారణ మయ్యెను. అమోఘ మగునాబాణము
సంధింపఁబోయి యీసంశయము వొడమి యూరకుంటిని. వాలి
యనుకొని నిన్నుఁగొట్టితినేని మిత్రఘాతుకుఁడనై యెల్లకాలము
నింద ననుభవింపవలసివచ్చునని శంకించి తప్పనిసరిగ మిన్నకుండ
వలసివచ్చెను. గతజలసేతుబంధన మేల ? దైన్యము నేఁడి ధైర్య
మవలంబింపుము. మీయిరువురికి భేదమగుపడున ట్లేదేని యొక
గుఱుతును నీవు ధరించినయెడల నది లేనివాఁడు వాలియని
యెఱిఁగి యమోఘమును వైరినాశకము నగునాబాణమున వాలిని
జంపుదు. అణుమాత్రము శంకింపకుము" అనియోదార్చెను.

1 కపి:- తరువాత ?

2 కపి:- ఆవల శ్రీరాముఁడు లక్ష్మణునిఁ బిలిచి కట్టెదుటఁ గాను
పించుచుండిన పుష్పితగజపుష్పలతికఁ జూపి యాపుష్పములచే
దామముఁగట్టించి సుగ్రీవునికంఠసీమ నలంకరించి వెన్నుఁదట్టి
భయముఁదీర్చి మరలఁ గిష్కింధకుఁ బయనమొనర్చుచుండెను.
నే నీలోపుగా నిటువచ్చి నీకంటఁబడితిని. ఈసోదెతో నింతకాల
యాపనమైనది. క్రమ్మఱ సుగ్రీవునిసామీప్యమునకుఁ బోవు
దము.

(తెరలో సింహనాదములు వినిపించును.)

1 కపి:- తమ్ముఁడా ! ఏమి యీసింహనాదములు ?

2 కపి:- అన్నా ! నేఁజెప్పితిఁగదా ? సుగ్రీవుఁడు శ్రీరామలక్ష్మణ
హనుమత్సమేతుఁడై కిష్కింధాపురద్వారమున భీషణసింహ
నాదంబు లొనర్చుచు వాలిని బోరికిఁ జీరుచున్నాఁడు. అచ్చటికే
పోవుదము పద.

1 కపి:- సరియే.

(తెరవాలు)

చ. బిలమునను౦డ నద్దముగఁ బెట్టఁడె పెన్నగ మోము? పోరిలోఁ
బొలిసెను వాలియంచుఁ జెపుపూనిక రాజ్యరమన్ గ్రహింపఁడే!
వలదని తార చెప్ప; బలశత్రునిసాయము కల్గనిమ్ము నా
చలము బలంబునన్ దవిలి స్వస్థునొనర్చుటఁ గాంతు స్వాస్థ్యమున్.

1 కపి:- అన్నగో! వాలి మహాగుహాద్వారమునకు వచ్చుచున్నాఁడు పద.

(పోవనిక జానును.)

## 2. స్థలకము - కిష్కింధాపురద్వారము.

వాలి:- (దుమికి) "బిలముప చుండ" (అనుపద్యమును జదువుచుఁ బ్రవేశించుచు) దుర్మదాంధా! సుగ్రీవా!

శా. ఔరా! యెంతటి ధైర్యవంతుఁడవు! పోరాటంగ నేతెంచి, తీ
బీరం బెచ్చుటఁబోయె నీదనుక? ఏప్పై జేయునే మున్ను? నీ
వేరీతిం దర్పమూలి నన్నుఁ గనఁగా నేతెంచితో? నీవు గం
భీరోత్సాహము వమ్మొనర్చి సమరోర్విన్ గూల్తు రా రమ్మికన్.

నిదురఁబోవు సింగంబు మీసలఁ బట్టిపెఱికినట్లును, కూర్కు
చున్న మహానాగంబు వాలంబుఁ దొక్కినట్లును, మృత్యువును
బొట్టువెట్టి పిలిచినట్లును నిదురించుచున్న నన్ను నీసింహనాదంబుల
నేల మేల్కొల్పితివి? మతంగమునిశాపంబున నాకు దుర్గమం
బైనందున ఋష్యమూకంబునఁ దలదాచుకొనుటచే బ్రదుకు
చున్నాఁడవుగాని లేకుండిన నిప్పటికే నీపా టేమైయుండునో!

సుగ్రీ:- (దుమికి) వాలీ! మాటలతో నేమిప్రయోజనము? దిగు
మెలమిఁదికి.

శా. కాఱుల్ ప్రేలఁగ నేమిలాభముర? దుర్గర్వాంధ! వాచాట! నీ
వీరాలాపము వీనులం బడఁగనే భీతిల్లి పాఱంగ నే
నారీరత్నముఁ గొంచు నెంచితివో? విన్నాణంబు దీపింపఁగాఁ
బోరాడ న్జనుదెమ్ము నీతెగువ సంపూర్ణంబుగాఁ గాంచెదన్.

క. సోదరు నన్యాయంబుగ
నేమటకా దతనిసతి గ్రహించుట యేఁటరా ?
కా దశనితుల్య మగునా
మోదున నీతండ్రి గదియఁబోయెదు నేఁడే.

వాలిః- సుగ్రీవా! రణాభిలాషులకుఁ బొల్లుమాటలతో నేమికార్యము?
ద్వంద్వయుద్ధమునకుఁ గడంగుము.
కవి. బలముఁగలాఁడనటంచు నధర్మపుపద్ధతినే చరియించెడి నిన్
ఖలుని వధించెద నిప్పుడె నిన్నుఁ గాఁగావఁగలాఁడెవఁడో చెపుమీ

వాలిః- బలియుఁడనై నకతంబునఁ గాదొకో పాఱితిగా తొలియుద్ధమునన్
మలిచెనె యింతనె యింతటిశౌర్యపుమోసులు ప్రేలఁగ సార్థకమే?

సుగ్రీః- అనుజునిదార గ్రహించినయట్టిసుదాంధునితోఁ బలుకాడినచో
ఘనతమపాపము సంఘటియించునుగా చెవృశాస్త్రము యేలయిటుల్?

వాలిః- ఘనమగుశౌర్యము లేమిని నీవిధిగా నన్నుఁ దలంచితి, వే
మన నగు? శౌర్యము వాక్పరపాండ్రనె న్యాప్రపంచ యుఁ దలంచితివే!

సుగ్రీః-నిలుపుమునిల్వను మాటలఁబోదిఁక నిన్నిపుడేపొలియించెదరా

వాలిః- త్రోలఁగక నిల్వము ముష్టిని గుద్దెదఁ దోఁడ యమాలయ
దన్యనమూ

సుగ్రీః- కలఁ గన కింకను గెల్చెదనంచును ... ...

వాలిః- ... ... కాలుఁలు కా నవి ప్రేలుటకుఁ

సుగ్రీః- తల యిలఁ గూలెను ... ...

వాలిః- ... ... తాకునఁ జెచ్చెదు

శ్రీరాః- (వాలి యెడమవైపుననుండి ప్రవేశించి స్వగతము) వాలి
సుగ్రీవులరెట్టింపు మితిమించినది. ఇఁక వాలిని బరిమార్చెదను.
(అని బాణము వదలును)

సుగ్రీః- ... ... తప్పక కూలితిగా శఠుఁడా !

వాలిః- హా ! (అనిబాణము తాకి పడి) ఎవఁడురా నన్నీ యధర్మ
యుద్ధమున బాణముచఁ బడఁగొట్టినఖలుఁడు ?

చ. మగఁటిమి కల్గువాఁ డెదరి మార్కొని కూలఁగఁజేయు టొప్పు, నేఁ
బగతునితోడఁ బోరఁగను బాణము మాటునడాఁగి నాటనే
యఁగ రణధర్మమే? యిటుల సక్రమము న్పొసరించినట్టి యీ
మగనినిఁ గాంచి నామనము మందగతి న్పరితెంచుచుండెడిన్.

సుగ్రీ:- (స్వగతము) అక్కటా! క్రోధ మెంతపొనర్చినది? మహా
పౌరుషశాలియు ననమానబలుఁడు నగువాలినిఁ గూలఁజేసినది
కదా? నే నెంతపాపిని. ఈపాపమునకు నిష్కృతి కలదా? అదిగో
హనుమత్సుగ్రీవరామలక్ష్మణులు వచ్చుచున్నారు.

హను:- (ప్రవేశించుచు)

వాలి:- హనుమంతా! ఎవ్వఁడిట్టి నీచవిధమున బాణప్రయోగమునఁ
గూల్చినపాపిష్ఠి?

శ్రీరా:- (ప్రవేశించి స్వగతము) ఆహా! వాలి యెట్లున్నాఁడు?

గీ. సాంధ్యసమయాన వెలుఁగుభాస్కరునిపగిది
సుకృతనిశ్శేషపతితతారకను బోలి
ప్రళయకాలప్రాగతభానుకరణి
ధర్మమాలాంచితుండయి వాలి వెలయు.

ఈబాణముఁగుప్పిన దెవఁడని హనుమను ప్రశ్నించుచున్నాఁడు.
నే సమాధానముఁ జెప్పెద. (ప్రకాశముగా) వాలీ! ఈబాణమున
నిన్నుఁ గూలనేసినవాఁడను నేనే.

వాలి:- (కోపారుణితలోచనుఁడై) నక్షత్రియవంశభూషణా! ఇది
యేనా ధర్మసంస్థాపనము? కలనైన నీ కపకారంబుఁ దలపెట్టని
నిర్దోషినగు నన్నుఁ గ్రూరబాణంబుచే నేలకూల్చితివి? ఘాతుక
మృగంబను గానే. భోజ్యమృగంబునుగూడఁ గానే. ఇరువుర
మన్యోన్యజయకాంక్షఁ బోరుచుండఁ జాటునఁ బొంచి శరప్రయోగ
మొనర్చితివి. ఎవరికృత్యంబులు వారు ధర్మబద్ధం బొనర్చుకొన
వలదా?

శ్రీరా:- వాలీ! ధర్మశాస్త్రపరిజ్ఞానశూన్యుండ వగుటను, వృద్ధసేవ
మొనరింపనికతంబునను, నాయొనర్చినకార్యము ధర్మవిరుద్ధమని

నీకుఁదోఁచుట విచిత్రముకాదు. నాకృత్యము ధర్మానుసారమే యని సిద్ధాంతముఁజేయుచున్నాఁడ. భరతసార్వభౌముని యాజ్ఞ ధర్మ పరిపాలనంబొనర్చుటకై నగరంబుల సైనికులు నియోగులు గలరు. జనపదంబులఁ దత్ప్రతిష్ఠాపనార్థము నన్ను నియోగించె. సుతా, భగనీ, భ్రాతృదారాగమన మొనర్చినపాపికి వధయే శిక్షవిధింపఁ బడియుండుట ధర్మాత్ముఁ డగుమనుప్రభు విట్టిపాపుఁ దప్పక శిక్షింప వలయు. రాజశిక్షితులై వారు స్వర్గార్హు లగుదురు. వాలీ! నీ వట్టిపాపివగుటఁ గూల్పఁబడితివి. మాటుననుండి బాణప్రయోగ మొనర్చితినని నన్ను నిందించితివి. మృగయార్థు లెప్పుడు డొంకల నుండియే కొట్టుచున్నారా? వలల నొడ్డి, యోదములఁ ద్రవ్వి, పలువిధంబుల నేమఱించియున్నను, పాఱుచున్నను, కొట్టి చంపుట లేదా? నీవు వానరుఁడవు. మృగమ వగుటఁ జేకొనినను, డీకొన కున్నను జంపవచ్చు ననుధర్మరహస్యముచేతను, నీచేఁబలాభావితుఁ డగుసుగ్రీవునకు నిను వధించి యాతని భార్యారాజ్యముల నిచ్చెద నన్నబాసచే నిశ్చలుఁడనై ధర్మసత్యరక్షణార్థమై నినుఁగూల్చితి. నీవో ధర్మవిహితకర్ముఁడ నగునన్ను దూషించితివి.

వాలి:- ధర్మప్రతిష్ఠాపనాచార్యా! దశరథరామా! ధర్మసూక్ష్మం బెఱుంగనివాఁడ నౌట నిస్సజ్ఞానంబున దూషించితి. నీధర్మ వాక్యంబులచేఁ దెలిసితి. ఈశిక్షవలన నపగతపాపుఁడ నౌట సం తోషితస్వాంతుఁడ నైతి. సర్వరాజ్యసుఖము లనుభవించితి. నా యంతటివీరుఁడు లేఁడనిపించుకొంటి. నాకుఁ గావలసినదేదియు లేదు. (కన్నీటితో) రామచంద్రా! పతితపావనా! ఒక్కటి మాత్రము కలదు. సర్వజగద్రక్షకుండ వగునీకిదిగూడఁ జెప్పవల సినది లేదుగాని యీప్రేమగలతండ్రి కడపటిమనవి నాలకింపుము.

ఆ. బాలకుండ నాథ, పరిపరివిధముల
మెలఁగువాఁడు, తండ్రి! మించుప్రేమ
గోముగాను బెంచఁగా మాఱిగినవాఁడు
తండ్రి మఱువ వాని దయను గనుమి.

నేను వేయుపర్యాయంబులు చెప్పనేల. పాపభార మంతయు మీాదే.

శ్రీరా:- వాలీ ! నీయంగదునకు వచ్చినభయ మేమియు లేదు. చిరంజీవి యువరాజ్యపట్టాభిషిక్తుఁడు కాఁగలఁడు.

వాలి:- అనుజా ! సుగ్రీవా ! ఇటురమ్ము.

సుగ్రీ:- (చెంతకు వచ్చి నమస్కరించును)

వాలి:- (చేత నిమురుచు) నాయనా ! కొంతకాలము నిర్లక్ష్యమున మెలఁగినవారము. విధిప్రాతికూల్యంబునఁ గర్మానుసారముగ నిన్ను నాదరణమొనర్చి పురంబు వెడలనడచి భార్యను హరించి చేయరానియకృత్యంబుల నెన్నియో జేసి యీాపతితపావనుని కృపాతిరేకంబున సకలపాపహరంబును స్వర్గసుఖదాయకంబగు రామబాణంబున శరీరంబు వాయ సిద్ధముగా నున్నాఁడ. నాతప్పుల క్షమించి నాకుమారుని నీకుమారునిగాఁ జూచుచు సర్వశక్తుఁడును, సర్వనియంతయు నగు, రఘునాయకుని మనం బెఱిఁగి సేవింపుము. అవిధేయతఁగాని యధర్మంబునఁగాని ప్రవర్తించిన నాగతియే నీకును మార్గదర్శకము. జాగ్రత్త. రాజ్యంబు ధర్మయుక్తంబుగఁ బాలించుచుఁ గీర్తికాముఁడవుకమ్ము. అపకీర్తి నాభాగధేయమైనను వీరస్వర్గ మనుభవింపఁబోవుచున్న నేను వగవఁబనిలేదు. నీవును నాయెడఁ జింతఁ దక్కుము.

సుగ్రీ:- (కన్నీటితో) అన్నా ! "గతజలసేతుబంధన మేల ?" నేనంగదుని నాకుమారునిమాఱుగాఁ జూచెద. నీవు స్వస్థుఁడవు కమ్ము.

వాలి:- హనుమంతా ! బుద్ధిమంతా ! మంత్రివర్గంబునెల్ల నేఁజూపిన యనాదరము సైరింపుఁడు.

హను:- ప్రభూ ! త్యాజ్యకాలంబునఁ బూర్వవృత్తాంతంబుల కేమి ? నేవానిని మనంబునం దుంచుకొనువాఁడనయినది కానిది దేవరకు వేద్యమే కదా ?

వాలి:- లక్ష్మణా ! అనుజ్ఞయా ?

లక్ష్మ:- అసహాయశూరా! రణపతనమే స్వర్గదాయకమనుచుండ రామబాణాపహృతప్రాణుండవగు నీభాగ్య మేమనవచ్చును? సుఖముగ నేగుము. అంగదవిచారము ముడుగుము.

వాలి:- (మూర్ఛిల్లును)

(తెరలో)

క. అసహాయశూర! నన్నిట
నసహాయత వీడి యవని నాశించుటచే
త సమరభూమిని బడి యా
వసుధనె ప్రియతరయటంచు వాంఛించితివే?

శ్రీరా:- హనుమంతా! తారకాంబోలు పతిమరణదుఃఖంబున నందు రుచు నిట వచ్చుచున్నది. ఆమె నోదార్చి యంగదు యౌవరాజ్య పట్టభద్రు నొనరించెదనని నేఁజెప్పినట్లు నచ్చఁజెప్పి వెనుకకుఁ బంపిరమ్ము.

హను:- చిత్తము. (నిష్క్రమించి అంగదయుక్తుడై ప్రవేశించును.)

శ్రీ:- అంగదా! చనిపోవనున్నమీతండ్రిని జూడుము. నాయనా! (అంగదుఁడు వాలియొద్దఁ గూర్చుండును.)

సుగ్రీ:- అగ్రజా! అంగదుఁడు వచ్చినాఁడు.

వాలి:- (ఇంచుక కనులు విచ్చి చూచుచు నంగదుని దగ్గరకు దీసికొని దేహము తడవుచు) నాయనా! అంగదా! నాపాపఫలానుసారము మృతిఁజెందుచున్నాఁడ. నీయిష్టానుసారము నావలె నిన్ను లాలించువా రిఁక లేరు. ఇఁక నీపినతండ్రివశుఁడవై యాతనిమిత్రామిత్రులయెడల నతిస్నేహవైరంబుల మాని మధ్యమమార్గవర్తివై శ్రీరామానుచరుండవై చిరంజీవివి కమ్ము. (అంగదునిహస్తముల శ్రీరామసుగ్రీవులహస్తములయందుంచి)

క. నయమార్గగామి! రామా!
దయఁగాంచుము వీని నీదుతనయునిపోల్కిన్ (సుగ్రీవునిదిక్కు)
ప్రియసోదర! నీతనయుని
క్రియ నీయంగదునిఁ గనుచుఁ గీర్తింగొనుమీ.

(శ్రీరామునిదిక్కై-) భవాంబుధితరణా! రామచంద్రమూర్తీ! అనుజ్ఞయా!

శ్రీరా:- (చేయిపైకెత్తి) వాంఛితార్థఫలసిద్ధి రస్తు.

హను:- మహాప్రభూ! అంగద యౌవరాజ్యపట్టాభిషేకమును, సుగ్రీవ పట్టాభిషేకము నొనరింప నాజ్ఞయా?

శ్రీరా, లక్ష్మ, వాలి:- తథాస్తు.

వాలి:- ఇఁక నాకేమియు కొదువ లేదు. నే స్వస్థుఁడఁ గావచ్చును.
(అని మూర్ఛిల్లును)

శ్రీరామ:- హనుమంతా! రక్తస్రావాధిక్యమున వాలి మరల మూర్ఛిల్లినాఁడు. దుర్భరస్థితిని సంతోషాతిశయంబునఁగూడ మరణ మాసన్నముకావచ్చును. ఈతనిచితివిధి యనంతరము సర్వసాగరపుణ్యనదీనదజలంబుల సర్వసంభారముల నాయత్తపరచుము.

హను:- భాగ్యము

సుగ్రీవ:- మహాప్రభునాజ్ఞానుసారమే.

శ్రీరా:- (అంగదు నెత్తుకొనును) (యవనిక జారును.)

3. స్థలకము. — కిష్కింధాపట్టణము.

(హనుమజ్జాంబవంతు లుందురు)

జాం:- హనుమంతా! నేఁటికికదా ధర్మమార్గానువర్తి యగుసుగ్రీవునికష్టము లంతమొంది వానరరాజ్యపట్టాభిషిక్తుఁ డగుట నాతని సాచివ్యమున సుఖముఁగనుచుంటిమి?

హను:- తాతా! ఇదియెల్ల శ్రీరామచంద్రకరుణాసంపాదితమేకదా? సుగ్రీవుఁ డెంతధర్మతత్పరుఁడైనను అధర్మమార్గగామి యగువాలి నెదిరించి గెలిచియుండునా? మిథ్య. మిథ్య. కాలపరిపక్వము కాకుండిన ధర్మముకంటె నధర్మమే బలవత్తరమగుట సాధువులే తెలుచుగా నట్టికాలమునఁ దలలొగ్గియుండుట తటస్థించుచుండును.

జాం:- హనుమా ! అగునగును. శ్రీరాముఁ డెంతటిబలశాలియో యంతటిధర్మపథానువర్తియు సాత్త్వికగుణప్రధానుఁడుగఁ దోఁచు చున్నాఁడు. మొన్నటిసుగ్రీవపట్టాభిషేకసభాభవనము రామచంద్రునిలేమి రోహిణీమనోహరరహితనిశివోలెఁ గళావిహీనముగఁ గనుపట్టెను. మనమహారాజుగారుకూడ శ్రీరామచంద్రుఁడు లేమికై యెంతో నొచ్చుకొనిరి. వారిని దునిమినవాఁడు సుగ్రీవ పట్టాభిషేకసమయమునకచటికి రాకుండుట కేదో బలవత్తర కారణ ముండకపోవదని తోఁచెడిని. నీకేమైన తెలియునా !

హను:- తాతా ! తెలియకేమి ? తెలియును. పదునాలుగేండ్ల రణ్యవాస మొనరింపుమని యాజ్ఞాపించినజనకుఁ డగుదశరథమహా రాజుగారియాజ్ఞాబద్ధుఁడగుట పురప్రవేశ మొనర్పఁగూడమి నాకృత ప్రతిజ్ఞాసత్యసంధుఁడు కిష్కింధాప్రవేశ మొనర్పక నాఁడేమకోఁటున సుగ్రీవపట్టాభిషేకమున కనుజ్ఞయొసంగె. శ్రీరామాజ్ఞానంతరమే యభిషేకప్రయత్నప్రారంభమై నిన్న ముగిసినవి. ఇప్పటికి ధన్యులము

జాం:- హనుమా ! సుగ్రీవునకు వాలి యొనర్చినయపకారమునకుఁ బ్రతి 'యంగదుని యువరాజునొనరించుటలో సుగ్రీవునిమహోదార గుణ మెంతశ్లాఘ్యము ?

హను:- తాతా ! మహారాజుగారిసద్భావము మనకుఁ గొత్తయా ? వాలితో నిందమిందు సమానబలుఁడయ్యును ధర్మాత్ముఁ డగు వాలియందలిగురుభావమునకదా ఋష్యమూకముఁ జేరెను? మొన్న వాలిమృతికై యెంతయో వగచెఁగదా ?

జాం:- అగునగును. ఆయన నిరతసుస్వభావుఁడు. అందుచేతనే 'మరణాంతాని వైరాణి' యని వాలియెడల వైరము వదలిపెట్టె.

హను:- తాతా ! అదియుఁగాక మరణకాలమున వాలి యంగదుని శ్రీరామసుగ్రీవుల కప్పగించునెడల రామచంద్రమూర్తి యంగదుని పుత్రసమానునిగఁ జూతునని వాగ్దానమొనరించి సుగ్రీవుని

కప్పగించుచు యౌవరాజ్యాభిషిక్తు నొనరింపుమని చెప్పినందున నట్లు చేసెను.

జాం:- ఓహో ! అటులనా ? శ్రీరామచంద్రుఁడు పురప్రవేశ మొనర్పనని చెప్పినాఁడని చెప్పితివి కదా ? లక్ష్మణసమేతుఁడై ప్రస్తుత మాతఁ డెచ్చట నున్నాఁడు ?

హను:- తాతా ! ఆమహాత్ముఁ డీవర్షాకాలము ప్రస్రవణగిరి గుహ యందుఁ గడుపనెంచి యీనాల్గుమాసములు కడచినవెంటనే తన దేవికై వెదకింపుమని సుగ్రీవున కానతిచ్చి యచ్చటనే వసించుచున్నాఁడు.

జాం:- హనుమా ! ఎంతకరుణార్ద్రహృదయుఁ డాప్రభువు ?

ఉ. దారను గోలుపోయినవెత న్విరహానలతప్తుఁ డయ్యుఁ, దా
నోరిమిఁబూని 'సౌఖ్యగతి నుండుము సంగడికాఁడ ! వర్ష' నం
చారవిపుత్రుని న్బనిచె నట్టిసుహృజ్జనకల్పకు న్మహో
దారుని రామచంద్రునిపదంబె సమాశ్రయ మెల్లవారికిన్.

హను:- తాతా ! అభ్యంతర మేమి ?

సీ. దుఃఖితరవివంశద్యుమణి శ్రీరాముండు విరహాన నిడుబాష్పబిందువు లన
ప్రేమభక్తులచేత సౌమిత్రి రామునికై విడిచెడిబాష్పకణము లనఁగ
రామునివ్యథకై కఱఁగి నగంబులు రాల్చుకన్నీటిధారలో యనంగ
యర్ధాంగికై కుందునట్టిరామునిఁ గనుతరువులదుఃఖాశ్రుధార లనఁగ

గీ. రామమయ మగుసర్వచరాచరములు నాథుదుఃఖసాహాయ్యమునను గ్రహించి
కాఱ్చునశ్రుధారాకృతి గాంచిచెలఁగు వర్షఋతుజలధార లవ్యారిగాఁగ.

జాం:- హనుమా ! ఈవర్షాకాల మెట్లో వెడలఁద్రోచి రామకార్యము తీర్ప యత్నింతము.

హను:- తాతా ! సరియే. అదుగో ప్రస్రవణగిరిగుహాంతర్భాగమున శ్రీరామలక్ష్మణు లాసీనులై యున్నారు. రాజాజ్ఞ కానిది యచ్చటి కేమిపని ? పోవుదము పద.

జాం:- సరియే పోవుదము పద. (యవనిక జాఱును)

శ్రీ

# శ్రీరామోద్యోగము

## తృతీయాంకము.

1. స్థలకము — ప్రస్రవణగిరిగుహ. శ్రీరామలక్ష్మణు లాసీనులై యుందురు.

ల:- అగ్రజా ! అపరదిక్కు పరికింపుము.

గీ. ఆధరణిజనుఁ గొని చనునసురరక్షము
వెంటనంటఁగ లేమిచే మింటికొనను
రంగ మరగను బరువిడి కృంగి పడిన
స్వామి భక్తునాకృతిని భాస్కరుఁడు తోఁచు.

చ. జనకజఁ గొంచు రావణుఁడు సత్పథమం దరుగంగఁ గన్నసా
క్షినగ్నుటఁ గాంచి యేమియును జేయఁగలేమిని మిన్నకుంటి రా
ముని కెటు మోముఁజూపుదని పోయెడి నస్తనగంబుచాటి కా
యినుఁ డసమర్థుఁడే గువిధ మిట్టిది కాదె ధనుష్మదగ్రణీ !

శ్రీరా:- సౌమిత్రీ ! మనవంశంబునకు మూలపురుషుఁడగుట నసఁ గూడదు కాని,

ఉ. తుంపురుబాష్పము ల్గనులఁ దోపఁగఁ బద్మిని యేడ్వ మానకే
తెంపున పశ్చిమాబ్ధిగతదేశగతుండగుఁ గ్రూరుఁ డద్దిరా !
సొంపునుఁ బాసి కావులను సొక్కుచుఁగట్టి నిమీలితాక్షియై
యింపుగ నాత్మనాథుఁ గన నెంతయుఁ దమ్మి జపించుఁ గాంచితే?

లక్ష్మ:- అగ్రజా ! నిజమే. కన్నీరు మున్నీరుగా నేడ్చుపద్మినిమాటఁ ద్రోసివైచి నిర్దాక్షిణ్యచిత్తమున నేగు కఠినహృదయుఁడు మన కేమిసాయ మొనర్చును ? కులమునకుఁ గులము తెవులు ; నీటికి నాచు తెవు లనికదా యార్యోక్తి ?

శ్రీరా:- సౌమిత్రీ ! సీతావిరహంబున నస్వస్థహృదయుఁడనై యేమో యంటిని. మిత్రుఁ డనుసార్థకనామధేయుఁ డగునీజగన్మిత్రుని నిందింపఁదగదు. జనులెల్లరు దోషైకదృక్కులుకాక మరాళన్యాయమున గుణమగ్ధమాత్రగ్రహణపారీణులు కావలయును.

సీ. ఏమిత్రుతముదర్శనేచ్ఛ సంభోగతపద్మిని రాత్రి తపంబొనర్చు ?
ఏమిత్రునహితార్థి నెంచి జక్కవచాన నిశయెల్ల నార్తి ధ్వనించుచుండు !
ఏకాంతిపుంజంబు నెద స్వప్నమునఁ గాంచి తుష్టిపూనఁ దమసంబు తూలు గుహల !
ఏకర్మఠుఁడు జనియించినయంతనే లోకంబు కార్యార్థమై కదంగు ?

ఆ. నట్టికర్మసాక్షి యగుచును జండశా
సనునిసర్వశక్తి శాసనమున
ననుదినంబు పశ్చిమాశ కేగెడి భానుఁ
దూలనాడ మూర్ఖపాళి కామె ?

లక్ష్మ:- అగ్రజా !

గీ. ధర్మసంస్థాపకుఁడు రవిధరణివిభుఁడు
చైత్రయాత్రార్థ మన్యదేశముల కరుగ
జారచోరతమంబులు సంతసమున
మసలుచుండగా యథేచ్ఛ దుర్మార్గములను ?

శ్రీరా:- అనుజా ! కుజనులు సద్యఃఫలప్రముదితహృదయులేకాని దూరదృష్టులు కారుగదా ?

గీ. ఇనుఁడు పోటయ్యె మన కింక నెవ్వ రడ్డ
మనుచుఁ దమమును జారచోరాళి దిరుగు
కువలయానందసంధాయకుండు సజ్జ
వైరి తముగాంచుచుంట లవం బెఱుఁగరు.

లక్ష్మ:- అగును. అగ్రజా! ఈవర్షాకాలపుటీదురుగాలి యేమివడ కించుచున్నది ? జడికిని నెండ కోర్చి తపంబొనరించుమహానులు నిజేముగ మహాశక్తసంపన్నులని యొప్పుకొనకతప్పదు. ఓరిమిని గుఱించి చెప్పవలసివచ్చినచో వారినే మున్ముందు చెప్పవలయుఁ గదా ?

శ్రీరా:- నాయనా! వారలు ద్వంద్వాతీతుల రగు మహాత్ములు. వారికిని మన కెక్కడిసామ్యము ? ఆనీలమేఘంబులవైపు తిల కింపుము.

గీ. కాలపురుషుండు వేసంగికాలమందు
జలదగర్భంబునం దిడి చేసినయట్టి
యంబుకణముల నిండుచూలాలు లగుచు
ప్రసవవేదనఁ దిరుగు నభమునఁ గంటె ?

లక్ష్మ:- అగ్రజా! ఈసారభోపేతజలకణంబులఁ గాంచితిరా ?

గీ. కాలసౌగంధికుండు జగమునఁ గల్గు
సనలధృతి దీయ నాకసంబనెడిగాజు
గోళమును గప్పి మచ్చుకై కుఱియఁజేయు
ధృతియన సుగంధజలబిందుతతులు వెలయు.

శ్రీరా:- సౌమిత్రి! ఈప్రస్రవణగిరిసౌందర్యంబుఁ గాంచితే ?

క. విదళితరిపురవిజనకును
ముదమునను గిరీట మీవు పూన్చెనగతి బె
ట్టిద మగువేసవి వేగిన
కుధరమునకు విధుఁడు సుమమకుటముఁ గూర్చెన్.

లక్ష్మ:- అగ్రజా! బహుశృంగారముగ నున్నది. ఇంద్రదిశఁ బరి కింపుము.

గీ. కుజనులమనోగతం బెఱుంగుట కుపథము
శీతలకరంబులను దువ్వ సెగుపని
తైక్ష్ణ్య మూనంగ రాదని తలఁచి శీత
భానుఁడై తూర్పుకొండఁ గన్పడు నినుండు.

(ప్రకాశముగా) అగ్రజా! కామరూపిణు లగునాజలదాంగ
నలవైపు చూడుఁడు.

గీ. చేదలఁ జరియించుమాయకట్టైనట సీత
తను దెగడఁగను బుధుఁడు రోహిణిని గొనుచు
పోవుగతి రావణుఁడు కొనిపోవఁ గనుట
సిరియు, చుక్కని జలదము ల్వరుసనెత్తు.

శ్రీరా:- గీ. జలదమా! నిన్నుఁ బోలుకంచుంబుఁ గలిగి
నీదుపుత్రిక సౌదామినిని హసించు
వపువుఁగల్గినజానకి నెపుడయేని
గాంచితివె దక్షిణాశ నెక్కడలనేని?

ఏమి? మాఱుమాటాడవు వాతకారవమా?

గీ. జలనిధులసలిలంబు వేసంగిఁ గ్రోలి
త్రాగుచుఁబోతువిధంబుగఁ దూఁగి చనుచు
బదులు చెప్పవదేమి దుర్మదము జలద
మా! సుబాహునిగతి నష్టె మఱచినావె?

ఓమారా! ఇన్నిఁటికిఁ గొంకుఁడవు నవు. అనంగుఁడవైన సిగ్గు
లేదు.

లక్ష్మ:- అగ్రజా! సర్వజ్ఞుండవైన యసంరతకామషట్పాసిగీయమాన
పవిత్రనామధేయుండవైన నీవే యిట్లు విరహాతిశయత్వంబున భాషణ
రహితజడవస్తుచయసంబోధము కామోద్దీపితస్మరసైన్యపర్యటనము
గా నుత్ప్రేక్షించిన నేమిలాభము! సుగ్రీవాభిషేకపూర్వము
వర్షాకాలాంతమున సీతాన్వేషణార్థము కపిసైన్యములఁ బంపి సిద్ధ
పడుమని నుడివితిరికదా? ఆమాట విస్మరించితిరే? దుఃఖబంధం
బుల వైరాగ్యకుఠారంబున విదారించినప్పుడుకిఁ గాని విజయము
గగనకుసుమముకదా? ధైర్య మవలంబింపుఁడు. తమరు సుగ్రీవుని
కిచ్చినగడువు రేపట నెల్లుంట తీఱును. ఆతఁ డిప్పటికే సర్వప్ర
యత్నముల నొనరించియుండును. కాదేని పైనికర్తవ్య మాలోచ
నీయము. స్వస్థమానసులరై కర్తవ్యమునకుఁ గడంగుఁడు.

శ్రీరా:- తమ్ముఁడా! సౌమిత్రీ! నిజము నిజము. మారా! యిఁక నీ యాటలఁ గట్టిపెట్టుము.

గీ. మత్తపికరుతి, శుకమృదుమధురవాక్య
సరణి, భ్రమరఝంకారాన సర్వజనుల
తన్మయత్వంబుఁ బొందింపఁ దలఁచె నార!
చాలు నీయింద్రజాలంబు సాగ దిచట.

ఆ. విపులవిశాలనేత్రి ప్రియ నిన్ను నామాన
శిష్టుఁ జేసి రూపుఁ జెఱచి త్రెంచె
నిరవశేషవైరినికరంబు రామబా
ణరుచి నీకు నేటికి రుచి యయ్యె ?

హా మన్మ చండాలుఁడా! నన్నుఁ బాసి. (స్వస్థుఁడై) విచారించి కార్యములేదు. కర్తవ్య విషయము విచారణీయాంశము. గడువు మేరకు సుగ్రీవుఁడు వచ్చుసంగతి నీపట్టు నెల్లుంట తేలునుగదా? అటుపైని కార్యక్రమ మాపలనే నిర్ధారణఁ జేయుదము. చాల ప్రొద్దుపోయినది. విశ్రమింతము. పద.

లక్ష్మ:- చిత్తము. (నిష్క్రమింతురు)

2. స్థలకము – కిష్కింధాపురసామీప్యము.

లక్ష్మ:- (బాణకృపాణపాణియై తెంపొసఁగుచునే యీక్రిందిపద్యముఁ జదువుచుఁ బ్రవేశించి)

ఉ. దారను గోలుపోయినవెత న్నురనాథతనూజుచేతఁ జే
కూరినయూపరాభవ మకుంఠితమై దహియింప నిల్వఁగాఁ
జేరెఁ జునేడఁ గొండ నివసించి వనంకెడి కోఁతిగానికిన్
శ్రీరమణీయరాజ్యరమ చెందఁగఁజేయవొకో మదం బిటుల్?
(క్రోధవేగమునఁ బండ్లు పటపటఁగొఱుకుచు)

క. తారుణ్యము, సిరి, రాజ్యము,
నేరమి వేర్వేఱఁ బురుషు నిపతితుఁ జేయున్

'కూరిన నన్నియు నొకచో
నారసికునిగతి వచింప నగునె యెవరికిన్ ?

హైయార్యోక్తి కనుపమానలక్ష్యము సుగ్రీవునియందు నిరూపిత మైనది. నిన్న శాంతాపరావతారుఁ డగునగ్రజుఁడు నన్నుఁ జేరఁ బిలిచి 'వత్సా ! లక్ష్మణా ! వర్షాకాలమాసచతుష్కము మితి మీఱె. ఆగ్రామ్యధర్మసురాపానమత్తునకుఁ గాలపరిమాణము కూడ మఱపువచ్చినట్లున్నది. దశరథరాముని నిజాపాంగావలోకన మెలఁగుసహాయయాచకమాత్రునిగఁ బరిగణించినతూష్ణీంభావుని నావాక్యమంత్రంబున సుద్బోధితు నొనరింపుమని వైరిభీషణంబులును, కర్ణకఠోరములును, నశనితుల్యంబులు నగుశాసనవాక్యంబుల నిట్లు నుడివె. అవినాపాటివానికిఁ బ్రాణాపహరణచణమారణ మంత్రంబులవలె స్ఫురింపఁజేయ యామదపుఁగోఁతి కెట్లుండునో యాదృశ్య మింక నిరీక్షణీయము. ఎంతటికోపమువచ్చె ! ఎంత విసుఁగుఁగొనెను ! అనవరతశాంతోల్లసితమందహాససుందరానన సంతృప్తహితుం డగునగ్రజుఁడు కోపఘూర్ణితపురోగమహుంకార జాజ్వల్యమానవదనార్కబింబుండై యొసంగినక్రోధంబున నుడి వినవచనంబు లిప్పటికిని నామనః ఫలకంబునను గర్ణంబులను స్థిర ముద్రితములై మ్రోయుచున్నవి. ఏమనెను ! ఏమనెను ! రాజ్య భార్యావిహీనాసహాయుని మున్ముందే రాజ్యేందిరాసమాలింగితు, రుమాతారానాథు నొనరించినకార్యార్థి ననుమనె. సత్యప్రతిష్ఠుఁడే పురుషోత్తముం డనుమనె. కృతఘ్నుఁడు మిత్రవంచకుఁ డాజన్మభూజనగర్హ్యుఁడును మరణానంతరము శవగ్రసనకంకసారమేయగృధ్రనికాయగర్హ్యుండని యెఱుంగుమనె. అంతకుఁ జలింపనియెడలఁ గనకపృష్ఠసమంచితాకృష్టఘనఘోషం బగురామ కోదండంబుఁ జూడ వాంఛయా యనుమనె. భ్రూభంగసమన్విత మండలీకృత కోదండమౌర్వీగుణోపేతపరిత్యక్తాశనిరావంబు కర్ణపేయంబా యనుమనె. విదారితవాలి యగుకనకపుంఖశరము కృతఘ్న ప్రాణానిలాసక్తదర్వీకరసంచలితజిహ్వాసాదృశ్యమై మిట్టిపడుచున్న

చనుమనె. భ్రాతృద్రోహియగుట వాలి యొకఁడే సుమాఁగాని సత్యమిత్రద్రోహంబుల సబాంధవంబుగఁ గూల్తునని చెవిసాటి చెప్పుమనె. సహజకోపానసుండ నగు నాకీవాక్యేంధనము లుద్వేగంబుఁగూర్ప సుగ్రీవవధసంసిద్ధుఁడనైననన్ను కోపం బనార్యంబగుట శిష్టపరిగ్రహణంబు కామి సమయానుకూలవచనరచన సుగ్రీవు సీతాన్వేషణకార్యోన్ముఖు నొనరించి రమ్మని యంతంబున నుడివె. (కొంతవడి పరిక్రమించి) కిష్కింధారాజహర్మ్యము కడకు వచ్చితి. నాకోపవీతిహోత్రాకృతిఁ జూచి రక్షకవనచరసమూహము పాషాణద్రుమహస్తు లయ్యు జంకి పరువెత్తుచుఁ గిచకిచారావముల భయముసూచించుచున్నారు. అంగదుఁడు మాత్రముయువరాజగుటధైర్యమువహించి నిలువఁబడియున్నాఁడు. వానివలన సుగ్రీవుఁ బిలిపించెద. అంగదా !

అం:- (వడకుచు ప్రవేశించి సాష్టాంగదండప్రణామ మాచరించి ఘటితాంజలియై వినమ్రుఁడై నిలువఁబడి) ప్రభూ ! ఏమియాజ్ఞ ?

లక్ష్మ:- చ. లలనలఁగూడి యాడుచు విలాసముగాఁదనరాజ్యదాత నే
దలఁపక గ్రామ్యధర్మపరతన్ రఘురామకృతాగ్నికీలికిన్
శలభముకాఁగనున్ననగచారిని నీపితృవ్యుఁ జేరి వే
తెలుపుము నామరాక సముదీర్ణజవంబున నంగదా! హితా!

అంగ:- చిత్తము. ప్రభునాజ్ఞానుసారమే. (నిష్క్రమించును)

లక్ష్మ:- మాయన్న నుడివినవాక్యంబులు చతురతమెఱయఁ గార్యవిఘ్నకారణము గాకుండ సామవచస్సరణి సుగ్రీవునకు వినచేవలయు (కొంచెము యోజించి) ఏమి, యంగదుఁ డింకను రాకున్నాఁడు ? ఆరాజార్భకునకు దర్శన మలభ్యమయ్యెనేమోయని భ్రాంతివొడమెడి.

శా. భూమీశప్రకరార్చనీయమయి, దుర్బుద్ధ్యుక్తదైత్యాంతకో
ద్దామంబై, మునిసంఘరక్షకసమర్థంబై, మహార్ఘ్యంబునై

సౌమిత్రిభ్రూజవాశ్వరోహణవిలాసంబై, యవార్యంబునా
రామాజ్ఞ న్వహియించునే నరుగఁగా రానట్టిచో టున్నదే !

ధర్మన్యత్యస్తమార్గచరులగు నీశాఖాచరవాసంబునఁ జోర నీరామానుజునకు భయహేతు వేమికలదు ? (వినుట నభినయించి) అదుగో యంగదుఁడు పిలుచుచున్న ట్లున్నది. ఈహార్మ్యముం జొచ్చెద. (కొంతవడి పరిక్రమించి)

సీ. నవరత్నమయతోరణపుఁగాంతి యొకచక్కి భర్మకుడ్యప్రభ పరగు నొకట
కాంచనతూలికలచీనాంబరఁబులద్యుతి దీపమాలాకాంతి తేజ మొకట
చందనమృగమదసౌరభం బొకవంక నగరుసాంబ్రాణిధూపాదు లొకట
కుసుమోపహారంబొచు పొక్కించఁగాఁగల మధుసౌరభంబ్రుదుమార మొకట

గీ. కాంచనతంత్రోచ్ఛలితలతాకాయపాద నూపురారవగళరవ మేపుమీటి
కర్ణములఁబడు శుద్ధాంతకాంత లుండు నంతిపుర మేమొ చొచ్చితి నక్కటకట!

నిశ్చలచిత్తుఁడ నగునాకుఁగూడ లజ్జవొడముచున్నది. కానిమ్ము. గడచినదాని కేమొనర్పవచ్చును ? సుగ్రీవదర్శన మగునుపాయ మేది? (యోచించి తలపంకించి) ప్రళయసమయపర్జన్యగర్జారవతు ల్యాస్మజ్జ్యాఘోషమే సుగ్రీవు నంతఃపురబహిర్గతుఁ జేయుఁగాక. (నారి సారించి) ఇదియుఁ గొంతకార్యకారి యైనది. మృగేంద్రగర్జాకర్ణన స్తంభీభూతమృగచయారావంబుపగిది సర్వరవము లుడిగి నవి. సుగ్రీవుఁ డింకను రాకున్నాఁడేమి ? కారణముకూడ మృగ్యము, దురూహ్యంబుగ నున్నది. అదిగో యొకకాంతమాత్రము దవ్వునుండి వచ్చుచున్నది.

గీ. రాముసోదరుకార్ముకరావము విని
మేఘగర్జానుచారియా మెఱపుఁబోలి
సిగయుఁ బటమును జారఁ జేఁజేత సరదు
కొనుచు నసియాడునడుముతో వనిత వచ్చు.

ఏవ రీమె ? సందియమేల తారయే. సుగ్రీవునకుబదు లీయమ యేలవచ్చినదో ? ఇప్పుడే తేలునుగదా ? పరవనితావలోకన మస మంజసము (ప్రక్కకుఁ దిరుగును.)

తార:- (ప్రవేశించి) శాంతస్వరూపా ! రాకుమారా ! భవదీయనిర్ని
ద్రప్రతాపానలమునకు శలభము గానెంచి నిశ్శంక మీయాజ్ఞ
మీఱితియేని, మీయెడల ద్రోహముఁ దలఁచినయాయదృష్టహీనుఁ
డెవ్వఁడు ? వచింపుఁడు.

లక్ష్మ:- పతిహితమార్గవర్తినీ ! సీతాన్వేషణార్థమై వర్షామాసచతు
ష్కము గడువ యత్నింపుమనినరామాజ్ఞ మీఱి మదిరాపాన
మత్తుఁడై కర్తవ్యకరణహీనత మిత్రకార్యానాచరణుఁ డగునీపతికి
కార్యజ్ఞురాల వెఱిఁగింపకుంటివా ? ఇట్టిపరమమిత్రద్రోహియెడల
నమానుషశక్తిసంపన్నుఁడును, ధర్మమార్గైకతత్పరుఁడును నగు
రామచంద్రుఁ డెట్లుప్రవర్తింపవలయునో యోజించి చెప్పుము.

తార:- వైరిసుష్కాటవీదహనా! మిత్రమానసకువలయామృతాంశా!
నిజము. నిజము. కోపం బించుక వారింపుము. మీమిత్రుఁడును
భ్రాతృతుల్యుఁ డగుసుగ్రీవునిదోషము సైరింపుఁడు. మిత్రులపట్లఁ
గోపింపఁదగవా ? సకలజగజ్జేగీయమానప్రతాపుఁ డగురామచం
ద్రునిశౌర్య మేనెఱుఁగుదు. వైరిసస్యగ్రీష్మాదిత్యుఁడ వగునీపౌరు
షం బెఱుఁగుదు. కాలాతిక్రమణ మెఱుఁగుదు. కాని వత్సా !

పంచపాది గీ. కష్టకాంతారసంచారు, కపిని, చపలు
రాజ్యయుతునిగ, నంగజరాజ్యసార్వ
భౌము నొనరించి సుఖయింపఁబంప మీదు
నాజ్ఞ మెలఁగెడు. కామలోలాత్మసహజ
కాలయాపనకై యింతకసల నేల ?

కుమారా ! నీవు కోపంబునఁ జిక్కినంత కామతంత్రంబునఁ
జిక్కకుండుట నీకాలవిలంబనదోష మహీనంబుగ నెంచుచున్నాఁ
డవు. పవనపర్ణాంబుభక్షులైనతపస్వులే కామపరతంత్రులైనతఱి
వత్సరంబుల దివసతుల్యంబుగఁ గడపిరి. మిత్రదోషంబులఁ బెద్ద
చేసి యాగ్రహించుట మీబోంట్లకుఁ దగునా ? అంతిపురము పర
కాంతానివాసంబగుట ధర్మాతిక్రమణదోషంబు పొసఁగకుండ
నిచ్చట నిలిచితివి. పరమసంతోషము. శీలరక్షణపరాయణా !

భర్తృమిత్రులగుమీ కంతఃపురప్రవేశ మసమంజసము కాదు. మీదర్శనాకాంక్షి యగుమీదాసు నిప్పుడే చూడఁగలరు.

(తెర లేవ సుగ్రీవుఁడు రుమాసహితంబుగ నుచితాసనమున నుండును.)

రుమ:- (నమస్కారమొనరించి వడఁకుచు నిష్క్రమించును)

సుగ్రీ:- (సాష్టాంగదండప్రణామ మొనరించి ఘటితాంజలియై నిలుచుండి వడఁకును.)

తార:- ఈయాసనము రామానుజునిచే నలంకృత మగుఁగాక.

లక్ష్మ:- (ఆసీనుఁడై సకోపవీక్షణుఁడై) వానరేంద్రా! సుగ్రీవా! సత్యనిష్ఠుఁడు, కృతజ్ఞుఁడు, విజితేంద్రియుఁడు, సత్వగుణభూషణుఁడే వంద్యుఁడు కీర్తనీయచరిత్రుఁడుగాని తదన్యునిదికూడ బ్రదుకా? అనదవై ఋష్యమూకంబున దీనదశయందున్న నీకొనరించినవాగ్దానానుసార మనపకారియైనవాలిఁ ద్రుంచి వానరరాజ్యపట్టాభిషిక్తుం జేసి వర్షాకాలమాసచతుష్కము సుఖించి యావల సీతాన్వేషణ మొనర్చుమనిన వల్లెయని కాలాతిక్రమ మొనరించి మదిరాస్త్రీలోలుఁడవై విరహసంతప్తహృదయుం డగుమిత్రుని పురుషోత్తముని దర్శనోత్సుకుఁడవు కావు. ఇది యన్యాయము. పంచమహాపాతకంబులకైన నిష్కృతికలదుగాని యసత్యాలాపియగు మిత్రద్రోహికి సబంధుమరణమే నిష్కృతి. సక్రోధుఁడై మా యగ్రజుం డిట్లు నుడివె

చ. అనద నటంచుఁ జేరిన దయార్ద్రమనంబున వాలిఁజంపి ని
న్వనచరపట్టభద్రుని నొనర్చిన రాజ్యసుఖాలసుండవై
మును పొనరించునాశపథముం స్మరియింపవు భర్మపృష్ఠమా
ధను విదె సజ్యమయ్యెను, కృతఘ్నుని వాలినిఁజేరఁబంపఁగన్.

క. జ్యాగర్జాయుక్తము లగు
ద్వ్యగశరాశనులఁ గుఱియు దృఢకార్ముకమే
ఘూగమకాంక్షితమతివై
యొగకు సోదరునిజాడ హితవంచనచే.

తార:- రాకుమారకంఠీరవా! సైరింపుము. సైరింపుము. రామ కార్ముకఘనాగ్ని మగ్గ నెంచుచాతకము కాఁడు సుగ్రీవుఁడు. మీ దాసుఁడు మిత్రవంచకుఁడు నసత్యాలాపియుఁగాఁడు. మిమ్మనవర తము స్మరించుచుండు. ఈతనియెడఁ గాలాతిక్రమణదోష మొక్క టియే కలదు. వానరసైన్యంబు లన్నియు నిప్పటికే యాహూతమై నవి. మిత్రునిదోషము క్షమింపుఁడు.

సుగ్రీ:- (స్వగతము) లక్ష్మణకోపానలము తారాఘనవచనామృత ధారాపాతంబునఁ గొంతశమించి ప్రసన్నమైనది. ఇఁక నే మా టాడ నుంకించెద. (ప్రకాశముగా) లక్ష్మణప్రభూ! వారిగతిఁ గన్నులారఁ జూచిచూచి రామజ్యానినాదము వినఁగుతూహలుఁడ నగునంతటియవివేకిని గాను. కృతఘ్నుఁడను గాను, మిత్రవంచ కుఁడను గాను, అసత్యాలాపిని గాను, శ్రీరామచంద్రసాహాయ్యము నా కనుదినస్మరణీయము. అనుపమానశూరుం డగువాలి నొక్క శరంబునఁ గూల్చినయసమానవీరునకు నాసహాయము నామమా త్రమే యని యెఱుఁగుదు. ఐన నసంఖ్యాకము లైనరావణసైన్యం బుల డీకొన సకలవానరభల్లుకసైన్యముల నిప్పటికే రండని యా జ్ఞాపించినాఁడ. తిరిగి దూతలఁ బంపెద. హనుమంతా?

హను:- (ప్రవేశించి) ప్రభూ! ఏమియాజ్ఞ?

సుగ్రీ:- ఆంజనేయా! మదాజ్ఞోన్మత్తులగుకొందఱు కపిభల్లుకేశ్వరు లిం తకురాలేదు. అట్టివారల కెల్ల మరల దూతల నంపి పదిదివసంబుల కిచ్చోటకు రానివారిశిరంబులు ఖండింపఁబడునని సుగ్రీవాజ్ఞగా నెఱిఁగింపఁబంపుము. సిద్ధసైన్యములతో శ్రీరామదర్శన మొన ర్తము.

హను:- మహాప్రసాదము. వార్తావహులఁ బంపి దేవరవారిని వేంబ డించెదను. (నిష్క్రమించును)

లక్ష్మ:- సుగ్రీవా! నీవు ధన్యుఁడవు. తనతప్పు గుర్తెఱుఁగువాఁడే మహాత్ముఁడు. ఆగుణము నీయెడలను శ్రీరామచంద్రునియెడలను

గంటిని. తుల్యసుగుణోపేతులసఖ్య మెంతయు నభివర్ణనీయముగఁ గుదిరినది. శ్రీరామదర్శన మొనర్ప బయలుదేరుదము.

సుగ్రీ:- చిత్తము. ఎవరురా యక్కడ ?

కపి:- (ప్రవేశించి) జయము జయము. దేవా ! ఏమిముదల ?

సుగ్రీ:- శిబిక సిద్ధపఱుపుఁడు.

కపి:- మహాప్రసాదము. ఆంజనేయునిముదల శిబిక యిప్పటికే సిద్ధపఱుపఁబడినది. దయచేయుఁడు. ఇటు ఇటు. (తోడ్కొనిపోవుచుండును)

(యవనిక జారును)

3. స్థలకము – ప్రస్రవణగిరిగుహ.

శ్రీరాముఁ డాసీనుఁడై యుండును.

శ్రీరా:- సౌమిత్రి యేగి తడవయ్యె. ఇంకను మరలిరాఁడు. కారణ మేమైయుండును ? రాజ్యభోగగర్వసింహాసనాసీనుండును నరిషడ్వర్గపరీవృతదురభిమానవపాంతరస్థితుండును, ననుపమానానేకమర్కటపారీంద్రపరికల్పితపరిఘూసంరక్షిత మదాంధగంధసింధురోపరిభాగసంస్థాపితాసనాసీనుం డైనయాప్లవంగాధముదర్శనభాగ్యము సౌమిత్రి కబ్బినదో లేదోయని శంకవొడమెడి. కార్యాకార్యాలోచనాసమర్థుండును వినయవంతుఁడును సచివమణి యగు కేసరినందనుఁడుమాత్రము తనప్రభువు నుద్బోధింపకుండియుండునా ? భర్తృహితాచరణచణ లగునుమాతార లాతని హెచ్చరింపకుండియుండురా ? సంతాపితవాలి యగునీరామబాణనినద మెవ్వరి చెవినిఁ బాయక యిల్లుగట్టుకొని యదియే యుద్బోధించును. సౌమిత్రి మరలివచ్చినఁగాని తేటతెల్లముకాదు. (కిష్కింధ దిక్కై)

చ. అదె కననయ్యె ధూళి, వినినయ్యెడి నయ్యదె మర్కటేంద్రస
మ్ముదరవ, మల్లదే శిబిక మ్రోయుప్లవంగసమూహనిస్వనం,
బదె కపివందిమాగధులయార్భటి, ఛత్రము, చామరంబు లిం
పుఁదళుకుమీఱ వచ్చె నివె, మోదముచేకురె నెంతయేనియుఁ

చూడఁజూడ వానరసైన్యము నేలయీనినట్లు కన్పట్టుచున్నది. సుగ్రీవుఁడు ప్రమత్తునివలెఁ గానుపించినను సప్రియత్నుఁడై యుండుటచేతనే యింతసైన్యముఁ గూర్పఁగల్గెను.

లక్ష్మ:- (ప్రవేశించి దండప్రణామ మాచరించి లేచి) అగ్రజా! సుగ్రీవుఁడు మీదర్శనమునకై వేచియున్నాఁడు.

శ్రీరా:- దీర్ఘాయుష్మాన్ భవ. వత్సా! ప్రవేశ పెట్టుము.

సుగ్రీ:- (ప్రవేశించి దండప్రణామ మాచరించి) రామచంద్రమూర్తీ! శరణు. శరణు.

శ్రీరా:- సుగ్రీవా! లెమ్ము.

సుగ్రీ:- (లేచును)

శ్రీరా:- సుగ్రీవా! ధర్మార్థకామముల సకాలమున సేవించువాఁడే రాజు. అనవరతకామాంధుఁడు భూరుహాగ్రసుప్తపతితతుల్యుఁడు సుమా. మిత్రపరిగ్రహణశత్రునిగ్రహచణుఁడే భూపుఁడు. ధర్మపథత్యక్తుఁడే వధ్యుఁడు. తెలిసినదా?

సుగ్రీ:- శా. శాంతింపఁగదె రామచంద్ర! కరుణాసంతర్పితాజాండ! క
ల్పాంతాభీలభయంకరాకృతిని దాల్ప నీ్మరు లోకంబులే
క్రాంతిం జెందఁగ నీప్లవంగుఁడు భయాక్రాంతుండు కాకుండునే
భ్రాంతిం జెందితి రేకృతఘ్నుఁడని నన్భావించి శూరాగ్రణీ!

క. హితవాచకులకు శాసన
గతి శిక్షను గూర్చు నేనె కాపురుషుగతిన్
హితవచన మొసరించిన
నతులబలా! నన్నుఁ బ్రజలె హాసియింపరొకో?

మీయాజ్ఞానుసారము వర్షాకాలముఁ గడపి సర్వదేశవాసికపి భల్లూకసైన్యంబులకు ముదలఁబెట్టి ప్రస్తుతము సిద్ధసైన్యములఁ గూడి వచ్చితి. ఇంచుక గడువుమాత్రము మీదె. దాసుఁడు క్షమార్హుఁడు. ఈసర్వసైన్యంబులు, నీసేవకుఁడు మీయాజ్ఞకై ఘటితాంజలులై వేచియున్నారు. మీచిత్తము.

శ్రీరా:- సుగ్రీవా ! ఆయాస్తరణమునఁ గూరుచుండుము.

సుగ్రీ:- చిత్తము. (ఆ స్తరణమునఁ గూరుచుండును.)

శ్రీరా:- అనుపమానప్రతాపకపిభల్లుకసార్వభౌమా ! సీతావిరహ దగ్ధుఁడ నగుట నిన్నతితీవ్రముగ హెచ్చరింప లక్ష్మణు నంపుటలో వేఱొకయుద్దేశ్య మేమియు లేదు. రాజ్యకార్యప్రమత్తత మాకార్యంబు విస్మరించితివేమోయని మందలించుటకే. మిత్రకార్యపర తంత్రా ! నీసన్నాహంబున కెంతయు సంతసము.

క. నిర్మల మగుచును శరదృతు
ధర్మంబున నభము ధరణి తనరెడి నంభో
వర్మంబుఁ బాసి సంగర
కర్మోన్ముఖవృత్తి మెలఁగఁగావలె నింక౯.

సకలవనవనమార్గజ్ఞుఁడవగుట మార్గదర్శకుఁడ వగుచుఁ గార్యదర్శివి కావలయును. మున్ముందు జానకి యుండునెలవుఁ గనుఁగొని తదుపరి ససైన్యముగ నెత్తిపోవుటయే మిగులయుక్తమని తోఁచెడి. ఇందులకు నీయభిప్రాయ మేమి ?

సుగ్రీ:- దేవరకన్న రాజనీతిజ్ఞు లెవరు ? మీసిద్ధాంతమునకుఁ బూర్వ పక్షపాదమును గలదా ? ఇదియే యనుసరణీయపథము.

శ్రీరా:- అర్కజా ! నీసైన్యంబున దుర్గమవనమార్గజ్ఞులును గార్య శూర్యులు నగుకొందఱ నాయకుల సీతాన్వేషణార్థము నలుదిక్కులకుఁ బంపుదము.

సుగ్రీ:- ప్రభూ ! నాసైన్యంబున నట్టివా రాంజనేయ, వినత, సుషేణ, శతవలినులు గలరు. ఇదుగో వారలు వచ్చియున్నారు.

(ఆంజనేయ, వినత, సుషేణ, శతవలినులు ప్రవేశించి నమస్కరించి ఘటితాంజలులై నిలిచియుందురు) ఈకార్యభార మంతయు నాసచివచూడామణి యగునాంజనేయునిభుజస్కంధమునఁ బెట్టితిని. మీయిచ్చవచ్చినదిక్కునకు వీరిని బలసమేతముగఁ బంపవచ్చును.

శ్రీరా:- ఇదియు నధికారిభేదం బారసి నీవే నిర్ణయింప సమర్థుఁడవు. కాన నియోగింపుము.

సుగ్రీ:- ప్రభునాజ్ఞానుసారమే. వినతుఁడు తూర్పును, పావని దక్షిణమును, సుషేణుఁ డపరదిక్కును, శతవలిని యుత్తర మేరయఁ గలరు. వినత, సుషేణ, శతవలినిప్రముఖులారా! మీరాయుచ్చే వచ్చినకపిశ్రేష్ఠుల వెంటఁగొని యొకమాసములోఁ దిరిగిరాఁడు. ఇది సుగ్రీవాజ్ఞ.

వినత, సుషేణ, శత:- చిత్తము. ప్రభువులయాజ్ఞ శిరసావహించుచున్నాము. పోయివత్తుము.

శ్రీరా, సుగ్రీ:- సరియే. సత్వరము రండు.

(వినత, సుషేణ, శతవలినులు నిష్క్రమింతురు)

సుగ్రీ:- రాఘవేంద్రా! రావణుఁడు జానకీదేవిఁగొని దక్షిణాభిముఖుండై యేగెఁగదా? లంకకూడ దక్షిణసముద్రముననే కలదు. చతురుపాయంబులను జతురోపాయంబులను బుద్ధిదేహబలంబుల రావణరక్షిత యగుజానకిజాడ నరయఁ బరమసమర్థుఁ డీహనుమంతుఁడే.

సీ॥ పొడమినవెంటనే పుట్టెడుబాలార్కఫలశంక నభమునఁ బట్టఁ బఱచె
నగవిదారణదక్షు మగువజ్రివజ్రి మేఘనుహానువును సుంత గాయపరచె
నుదయాస్తనగము లేవిదితమహాబలుఁ డంజ యుడఁగఁ దావు లగుచు నమరెఁ
రవిరథవేగశిరశ్చలనంబున భాస్కరుచెంగటఁ బడసె విద్య

గీ॥ దివ్యవరములఁ బడసినధీరవర్యుఁ డష్టసిద్ధులఁ బడసినయట్టిమేటి
వేగవిజితపవనుఁడు కపిప్రవరుఁడు పావనియె తగు నీకార్యభారమునకు.

శ్రీరా:- సుగ్రీవా! నివురుగప్పిననిప్పయిన మనహానుమంతుఁ డింతటివాఁడని యెఱుంగనైతి. సమయజ్ఞుఁడ వగునీవంటిసఖుఁడును బావనివంటిసర్వసమర్థుఁడును, స్వామికార్యధురంధరుఁడును, సర్వవేదశాస్త్రవేత్తయు, యుక్తాయుక్తపరిజ్ఞాతయు, కార్యశూరుఁడునై మూచిరమ్మనఁ గాల్చిరాఁగలచతురుఁడు చారకృత్యంబు నిర్వ

కింత సాధ్యముకానియర్థ ముండునా ? జగత్ప్రాణపుత్రా ! ఆంజనేయా ! ఈఘనకార్యంబునకు రవిజుఁడు నిన్ను నియోగించుటఁబట్టి జానకిజాడ నెఱింగిరాఁగలసమర్థుఁడవు నీవేయని నాకును దోఁచుచున్నది. భాగ్యవశమున జానకిఁ బొడఁగంటివా రాక్షసమాయల ననుదినము వేగుకతమున నిన్ను నమ్మకుండ వచ్చును. (ముద్రిక నిచ్చి) ఇది యస్మన్నామాంకితమౌ ముద్రిక. దీనిఁ జూచినంతనే నిన్ను నాదూతగా భూమిజ నిస్సంశయముగ నమ్మును. హనుమా ! నేనేటుగాఁ జెప్పవలయునా ? సకల శాస్త్రవిదుండ వగునీకు నే బోధింపవలసిన దేమికలదు ? అయిన నిటురమ్ము (అని చెవిలోఁ జెప్పివచ్చి తిరిగి కూర్చుండి) పావనీ ! పరేంగితావగాహనచణుఁడ వగునీకు నాస్థితి బీజవృక్షన్యాయమున సూత్రప్రాయముగ నుడివితి. నాస్థితి మాజానకికిఁ గనులఁగట్టి నట్లు చెప్పి దుఃఖాపనయ మొనరించి వియోగవిరహాభిన్ను లగు సతీపతులఁ గూర్చి జగత్ప్రాణసుతనామము సార్థక మొనర్చు కొనుము. సత్వరము శుభవార్తావహుఁడవై రమ్ము.

హను:- మహాప్రభూ ! రామచంద్రమూర్తీ ! యుష్మత్సమ్మానా సర్వజ్ఞా యీకీశమాత్రుని బెద్దఁజేసి కార్యభారమంతయుఁ బైఁబెట్టితిరి. దాసుఁడు స్వామికార్యనిర్వహణమున ననుగ్రహపాత్రుఁడుగాఁ బ్రయత్నించును. లక్ష్మణప్రభూ ! అనుజ్ఞయా ?

లక్ష్మ:- రామభక్తాగ్రేసరా ! సుగ్రీవసచివా ! అయోధ్యాకిష్కింధ రాజవంశరక్షణభారవహనసమర్థా ! శీఘ్రమేవ శుభోదంతయుక్త పునర్దర్శన మస్తు.

హను:- వానరసార్వభౌమా ! సుగ్రీవప్రభూ ! సెలవా ?

సుగ్రీ:- శీఘ్రమేవ పునర్దర్శన మస్తు.

హను:- శ్రీరామచంద్రప్రభూ ! దాసున కాజ్ఞయా ? సాష్టాంగదండ ప్రణామ మాచరించి లేవ)

శ్రీరా:- వాంఛితార్థఫలసిద్ధి రస్తు. (ఆశీర్వచనపూర్వకముగాఁ జేయి పైకెత్తి)

గీ. స్వామినృపభక్తులును భుజస్కంధయుగళి
గా, సమీరుండు దేహంబు గాఁగ, నష్ట
సిద్ధు లుపచారగణ మయి చెలఁగునీకు
రామతత్వమే సర్వార్థకామద మగు.

హను:- ధన్యోస్మి. అనుగృహీతోస్మి. సుగ్రీవలక్ష్మణసహితరామ
చంద్రప్రభువునకు జై.

సుగంధి. రామ ! రామ ! రామ ! రామ ! రామ ! రామ ! రాక్షస
స్తోమనాశ ! భక్తపోష ! సూర్యవంశభూషణా !
కామితార్థకల్పకాగ ! క్షత్రవర్ణమండనా !
రామ ! రామ ! రామ ! రామ ! రామచంద్రభూవరా !

(సంతోషాతిశయమున నాట్యములో నిష్క్రమించును)

(యవనిక జారును.)

## 4. స్థలము — వింధ్యాద్రిగుహ.

(అంగదహనుమజ్జాంబవంతు లుందురు.)

అంగ:- అక్కటా ! వానరరాజ్యరమాధురంధరుం డగుసుగ్రీవమహా
రాజు పెట్టినగడువు మీఱినది. దార్ఢ్యము కుంగిపోయెడిని. రామ
సుగ్రీవులకోపాగ్ని కింధనముల మగుటమాత్రము సిద్ధాంతార్థమై
కనుపట్టెడిని. కందమునియాశ్రమ మేమి, రజతగిరి యేమి, క్రోధ్రు
వన మేమి, సప్తపర్ణ మేమి, ఈవింధ్యాద్రి యేమి - వెదకివెదకి
కాళ్ళు పడిపోవుచున్నవికదా ? ఈఋక్షబిలంబునఁ జిక్కుకుండిన
నింకఁ గొన్నికడల వెదకఁగల్గి గడువులోపుగా మఱలిపోయియుం
దుముకదా ? ఇంతకు నాసాధుశీల స్వయంప్రభయనుగ్రహమున
నిచటికిఁ జేరఁగల్గితిమి.

ఆ. సుఖదములవిధానఁ జూపట్టునవి యెల్ల
దుఃఖదంబు లగుచుఁ దోఁచుఁ బిదప

ఋక్షబిలము వెడలురీతి సుఖం బని
తలఁప నేఁడు దుఃఖద మది యయ్యె.

అందేయుండిన నీచింతాకారణము లేకయే సుఖముగ మ్రగ్గి యుందుము. స్వయంప్రభాకారుణ్య మీభాగ్యహీనులపట్ల 'ముల్లుఁ దీసి కొఱ్ఱడచినట్ల'యినది. ఓప్లవంగపుంగవులారా! శక్తివంచన లేక యింతమట్టు నెమకితిమి. రామకార్యనిర్వాహకుఁడయ్యెనని వానరనాయకునకు మాటదక్కుట 'శశవిషాణము'గ నున్నది. గడువుమీఱుట చండశాసనుం డగుసుగ్రీవుని, విరహతాపానల సంతప్తహృదయుఁ డగురామచంద్రునిసాన్నిధ్యముఁ జేరి యాయర్కజునిచే మరణదండనమొందుటకంటె నీవింధ్యాబిలంబున నుండిన మన నారామచంద్రుఁడుగాని సుగ్రీవుఁడుగాని యెఱుఁగ నేరరు. మీయెడ నెట్లున్నను నాపితృవ్యుఁడు కాలభంగమిషంబున నాకు మరణదండన విధించుఁగాని మననీయఁడు. మీయెడలఁ గూడ నాప్రచండశాసనుఁడు వేఱువిధంబునఁ బ్రవర్తించునని నాకు నమ్మకములేదు. కావున మన మెల్లరము బిలంబున నుండుటయే శ్రేయస్కరమని తోఁచుచున్నది. ఇంతకు నన్ను యౌవరాజ్యంబున నిల్పినరామకార్యంబు నిర్వహింపలేనివాఁడ నయితినని మాత్రము చింతించెద. విధిప్రాతికూల్యమునకుం బౌరుష మేపాటిది? ఇది సర్వజనవేద్యమే కదా! ఈవిషయమై మీయుద్దేశ మేమి?

హను:- (స్వగతము) ఆహా! ఈయువరాజు మిక్కిలి నేర్పరి యగుటచేతఁ గాలము మితిమీఱినకారణంబును గల్పించి భయభ్రాంతుఁడైన ట్లీభేదోపాయం బాలోచించి యీయెత్తువేసె. మాలో మాకుఁ బక్షము లేర్పడునట్లు చేయనున్నది. కావున నీతనివాక్యంబులఁ జతురతతోఁ బూర్వపక్షమొనరించి స్వామికార్యనిర్వహణవ్యగ్రుఁడ నగుటకు యత్నించెద. (ప్రకాశముగా) యువరాజా!

చ. సురపతిసూనుఁడో జనకశూరతఁ గల్గి ప్లవంగరాజ్యపుం
సిరి వహియింపఁ జేవగలసింహకిశోరుఁడ వైననీవె యీ

సరణిని డాఁగఁగాఁదగునె ? సత్యపరాక్రముఁడైన రామభద్రా
వరుని సుమిత్రానందనునివాడిశరంబులు నిన్నెఱుంగవే ?

క. గురునాజ్ఞ యెడల నిరసన
పరత్వము వహించునట్టిపాపున కిహమున్
బరముం గలదే ? మమ్మను
సరించి వచ్చుటయె పరమసంతోషద మా.

యువరాజా ! ఎట్టికష్టంబులందును సుగుణభూషణుం డగు సుగ్రీవుని వీడి యెఱుఁగనిమంత్రిచతుష్కము చతురుపాయంబుల లోఁగనివారు. తక్కినసుఖాచపలు లసద్రమాసక్తులు. వీరిని నమ్మి 'రెంటికిం జెడినరేవడ' వగుదువు. నామాట వినుము. ధర్మజ్ఞుఁడు సత్యప్రతిజ్ఞుఁ డగునీపితృవ్యునివలన నించుకయు భయము లేదు. సర్వనియంతయు, వైరిభీషణుండును, ఆశ్రితరక్షకుఁడును, కరుణార్ద్రహృదయుఁడు శరణాగతవత్సలుఁడు నగుశ్రీరామచంద్రుఁడు లేఁడా ! భయ మేమియు లేదు. రమ్ము నామాట వినుము.

అంగ:- హనుమా ! స్వామికార్యధురీణా ! సుగ్రీవునిసహజగుణంబులు నా కపూర్వంబులు కావు. వైరు లీద్వారమున రాకుండఁ గాచుచుండుమని చెప్పిన బిలద్వారమును గొండచే మూసివచ్చిన సహోదరద్రోహి. అసదయై యుండినతఱి దగ్గరఁ జేర్చి రాజ్యదారల నొసంగినపరమమిత్రుఁ డగుశ్రీరామునికార్యము మఱచిన కృతఘ్నుఁడు. ప్రస్తుతసీతాన్వేషణము రామబాణభీతిచేత నేకాని కృతజ్ఞతాపూర్వకము కాదు. మాతృసమాన యగునగ్రజుని పత్నిని జెట్టఁబట్టినకామాంధుఁడు. రాజ్యమునకై యన్నను జంపినమహాక్రూరుఁడు. రామభయావిష్టుఁడై నను యువరాజు నొనర్చెనే కాని రాజ్యార్థమై యెన్నఁడేని నను జంపకమానఁడు. భయంకరబంధనాన్వితమరణముకంటెఁ బ్రాయోపవేశమే సర్వథా సుఖదాయకముగాఁ దోఁచెడి. శ్రీరామ లక్ష్మణ సుగ్రీవ రుమా మాతలకు నాయభివందనములఁ జెప్పుఁడు. పుత్రశోకంబున మా

మాతకూడ మరణించు. ఆమె నామరణ మోదార్చుఁడు. సుఖముగ నేగిరండు. (దక్షిణాగ్రంబులుగ దర్భలిడి సముద్రతీరంబునఁ బూర్వాభిముఖుఁడై కూర్చుండి)

సీ. క్రించుబుద్ధి గలకైకేయికి దశరథక్ష్మాపతి వరము లొసంగనేల ?
ఒసఁగెఁబో శ్రీరామునుగ్రవనంబున కంపెడివరమె కాంక్షింపనేల ?
కాంక్షించెఁ బొమ్ము రాఘవువెంటఁ గాననసీమకు సీత వెంచేయనేల ?
వెంచేసెఁబో యామె వంచనబుద్ధిని దొంగిలి దనుజుఁ డేగంగనేల ?

గీ. వాలి రామునిచేతఁ జావంగనేల ? యల్లసుగ్రీవుఁ డిటుల మమ్ముంపనేల ?
సీతఁ గాంచక మితిమీఱఁజేసి తుదకు చావవ్రాసితే మాకు నీజాడ ? ధాత !

అంగ, జాంబ, హను:- అయ్యో ! దైవమా ! యెట్టియిక్కట్టు దెచ్చితివి. అయ్యో ! (అసిపెద్దపెట్టున రోదనముచేయుదురు)

సంపాతి:- (మెడ వెళ్ళఁబెట్టి) ఏమీ వింధ్యగహ్వరములు మాఱ్మ్రోయు దుఃఖాక్రందనము ! పర్వతసమాను లగుకపులు దుఃఖించుచుఁ బ్రాయోపవేశముచేసి మరణమునకై వేచుచున్నట్లున్నదే. ఆహా ! భగవానుఁడా ! నీకరుణామయత్వ మనిర్వచనీయముకదా ? ఈకపులు మృతిఁజెందిన దినమున కొక్కొక్కరి నెరఁజేసికొనుచుఁ గొలదిదినములు సుఖజీవనముఁ జేయఁగలను. వా రేమో యనుచున్నారు వినెద.

అంగ:- ప్లవంగపుంగవులారా ! ఆవైపు కొంచుఁడు.

గీ. సీతజాడఁ గనెడిబుద్ధిఁ జెనటు లిటకు
వచ్చి రట్టికపిచయంబు వరుసగాను
మ్రింగుమని రావణుఁడు పంపుమిత్తి యిట్టి
యాకృతి న్గొని వచ్చెనా యనుచుఁ దోఁచు.

ఏమిచేయఁగలము ? ఐననేమి ? శ్రీరామకార్యార్థము ప్రాణత్యాగముచేయఁగనుట మనయదృష్టవిశేషముకాదా ?

గీ. రామకార్య మొనర్పఁ జరాచరములు
ఖగమృగాదులు సాయమై క్రాలలేదె ?
ఆయసురుఁ దాకి పోరి జటాయు వకట !
చచ్చి పరమపథమునకుఁ జనఁగలేదె ?

సంపా:- వానరులారా! ఎవరు మీరు, నాయనలారా! ఎన్నాళ్ళ కెన్నాళ్ళకుఁ గర్ణపేయమగు మాజటాయునామము నాచెవిని వేసితిరి? కాని యతఁడు మడిసెనని యా మీరు చెప్పుచుంటిరి? హా సోదరా! (దుఃఖముతో) నాయనలారా! పక్షవిహీనుఁడను. నన్ను సాగరముదరిఁ జేర్పుఁడు. అనుజునకు నివాపంబు లిడి వచ్చి యాసీతవృత్తాంత మెఱిఁగింతు.

జాంబ:- ఈపక్షినిఁ గొనితెచ్చుట మృత్యువును మూటఁగట్టుకొని తెచ్చున ట్లగునేమో?

అంగ:- తాతా! చావసంసిద్ధులమై యున్నమనకు భయమేల? సముద్రంబువద్దకుఁ గొనిపోయి యిటకుఁ దీసికొనిరమ్ము. సీతవృత్తాంత మెఱిఁగించెద ననెఁగదా?

జాంబ:- సరియే. (అని నిష్క్రమించి) సంపాతియుక్తుఁడై ప్రవేశించి సంపాతి నట దింపును.

సంపా:- (అంగదుని దిక్కై) వానరవీరా! నీ వెవరు?

అంగ:- విహంగమనాయకా! కిష్కింధలో ఋక్షరజుండను నొకకపివరేణ్యుఁ డుండె. అతనికి వాలిసుగ్రీవు లనునిరువురు మహాబలులు కొమరులు గలరు. నే వాలిపుత్రుఁడ. అంగదుఁడను. సార్వభౌముఁ డగు దశరథరాముఁడు జనకాజ్ఞానుసారము దండకాజనవాసము పొంత నుండ నాతనిభార్య సీతను రావణుఁ డపహరించె. సీత గొనిపోవుచున్నరావణుని దశరథమిత్రుఁడౌట జటాయువు తాకి యుద్ధమొనర్చి వృద్ధుఁడగుట నతనిచేఁ గూల్పఁబడె. శ్రీరాముఁ డాతని సంస్కరించి దివ్యపద మొసంగె. ఆరామచంద్రుఁడు సుగ్రీవునిస్నేహమొనర్చి నాతండ్రినిఁ జంపి వానరప్రభువై సీతాన్వేషణార్థము మమ్ముఁ బంపె. మేము వెదకివెదకి వేసరితిమిగాని యాయమఁ గానరైతిమి. అదియుఁగాక మయనిర్మితఋక్షబిలంబుఁ జొచ్చినకతనఁ గాలము మితిమీఱె. రాజాజ్ఞమీఱుట ప్రాయోపవేశ మొనర్చి మృతికి సిద్ధపడితిమి. సరి. తాత జటాయువు మీాయనుజుఁడా?

సంపా:- అంగదా ! నాపేరు సంపాతి. పరమపద మలంకరించినజటా
యువు నాతమ్ముఁడే. చిన్నతనమునఁ బందెమువైచుకొని మే మిరు
వ్ురము సూర్యమండలముదరియ నాయెరకలు భస్మమౌట నే
నీవింధ్యపైఁ బడితిని. ఆతఁడు దండకాటవింబడెఁ గాఁబోలు. నేను
8000 వత్సరముల వృద్ధుఁడ. సాయమొనర్ప నశక్తుఁడఁగాని రామ
కార్యాభిక్షకై మాటసాయ మొనర్పఁగల. ఒకరో జంజనాచల
సమానకాయుఁ డగురావణుఁడు హారామా ! హాలక్ష్మణా ! అని
కుయ్యిడు నొకకాంత నెత్తుకొని గగనమార్గంబునఁ గొనిపోవుటఁ
గంటి. ఆమె సీతగానోపు. వైనతేయసంతతివార మగుట మాకు
శతయోజనపరిమితదీర్ఘదృష్టి కలదు. ఆరావణుఁ డామెను గొని
దక్షిణసముద్రమున శతయోజనపర్యంతంబున సముద్రపరిఖా
వృతంబును స్వర్ణవప్రరక్షితంబైన లంకాపట్టణంబున దాచియు
న్నాఁడు. మీ శక్తిసామర్థ్యంబుల నటకుఁ బోయిన సఫలీకృత
యత్నులై మరలఁగలరు. నేను వింధ్యపర్వతవాసినైయుండిన
నిశాచరమునియనుశాసనంబున నెనిమిదివేలసంవత్సరములనుండి
మీరాకకై వేచియుండి నాకార్యభారముఁ దీర్చుకొనినాఁడ.
నిశాచరమునియనుగ్రహంబున నాకివే ఱెక్కలు మొలచుచు
న్నవి. రావణనాశన మొనర్ప శక్తులరు మీరిఁక జాగుచేయక
సముద్రలంఘనోపాయం బాలోచింపుఁడు.

అంగ, హను, జాంబ:- పక్షిరాజా ! రామకార్యసాఫల్యమార్గదర్శి
వియుఁ గృతకృత్యుఁడవగుని కివే మాకృతజ్ఞతాపూర్వక వందన
శతంబులు.

సంపా:- నేను నాపక్షజవపరీక్షార్థము గగనంబున కెగయుచున్నాఁడ.
కపిపుంగవులారా ! క్షేమమునఁ బోయి రండు. కార్యసాఫల్య
మస్తు.

(యవనిక జారును)

## 5. స్థలకము - సముద్రతీరము.

(అంగదజాంబవంతులు లోకపరీక్షను చేయుచు కొంచెము దూరముగ హనుమంతుఁడును నాసీనులై యుందురు.)

అంగ:- తాతా! చూచితివా యీజలరాశిని ?

మ. విలయాంభోదపరీవృతంబయినవిన్వీథిక్రమంబై, తిమిం
గిలనానాముఖవారిచారమృగసంకీర్ణంబునై, రాక్షసా
వళిసేవ్యం బయి, దుర్నిరీక్ష్యమయి దుర్వారార్భటీయుక్తఫం
ఛలమత్తుంగతరంగసంకులమునై సంద్రంబు ఘూర్ణిల్లెడిన్.

తరణోపాయం బేమియుఁ దోఁచకున్నది. మనకపివరేణ్యుల లాఘవశక్తి నెఱింగినవాఁడవు వ్యక్తీకరింపుము.

జాం:- యువరాజా! గజ, గవాక్ష, గవయ. శరభ, గంధమాదన, మైంద, ద్వివిద, సుషేణు లొక్కొక్కరికంటె నొకరు పదామడ హెచ్చువంతున లంఘింపఁగలరు. నేను యౌవనమునఁద్రివిక్రమునిఁ జుట్టివచ్చినను నేఁడు కీళ్ళకుఁ గిందైనఁ దొంబదియామడకంటె లంఘింపఁజాల. దుర్నివార్యం బగునీవార్ధకము రామకార్యాచరణాసమర్థు నొనరించినందుల కెంతయు వగచుచున్నాఁడ.

అంగ:- తాతా! జాంబవంతా! నేను శతయోజనపర్యంతము పఱచఁగల నను ధైర్యము కలదుగాని యది యేమికార్యకారి యగును? సంపాతినిర్దేశప్రకారము రావణపుర మగులంక శతయోజనములు దవ్వు కలదట. నేను శతయోజనలంఘన మొనర్చినను మఱలి రాఁజాలనేమో యని తోఁచుచున్నది.

జాంబ:- యువరాజా! నీసామర్థ్యము నీజనకున కేవిధంబునను లొచ్చు కాదుగాని ప్రభువు సదాపరిరక్షణీయుఁడగుట మీలంఘనమునకు మీసేవకు లొప్పుకొనఁజాలరు. ప్రభువు వృక్షమూలసదృశుఁడు. మూలవంతం బగువృక్షము పుష్పఫలశోభితం బగుఁగదా?

అంగ:- తాతా! మఱి యేమియుపాయము యోచించితివి? జాడ నెఱిఁగియుఁ బ్రాయోపవేశమే శరణ్యమా?

జాంబ:- యువరాజా! ఇంచుక యోపికఁ జిక్కఁబట్టుము.

గీ. ఉదధు లింకఁగని, మ్మలయుడుమనోహ
రుండు శైత్యమ్ము విడనిమ్ము, రుద్ధభాస్క-
రం బయిన మేరుభూధరంబు వ్రయ్యనిమ్ము
రాముకార్య మభంగంబు రాకుమార!

నిర్నిద్రప్రతాపుఁడును, ధైర్యహేమాద్రియును, జవసత్వ తార్క్ష్యుఁడు నగుహనుమంతుఁడు మౌనముద్రవహించి యేవిధముగా గంభీరసాగరంబువలె నేకతంబునఁ గూర్చుండియున్నాఁడో చూచితివా? అదియే కార్యశూరుని లక్షణము. నే నాతనిఁ బ్రోత్సహించెద. నీ వూరక చూచుచుండుము. (హనుమంతుని సమీపించి) జగత్ప్రాణపుత్రా! హనుమంతా!

ఉ. వ్రేలఁగవైచి మోములఁ గపిప్రవరావళి దుఃఖమగ్నతన్
దూల నచంచలత్వమున దూరమునందు మెలంగెదేల? యా
భీలపరాక్రమాంచితకపిప్రభు, రాఘవకార్యధుర్య! చా
ల్సాలుఁ ననుగ్రహింపుము, విలంబన మేల? ప్రభంజనాత్మజా!

చ. ఖరకరసూతిశాసనము, కంజహితాన్వయుజ్యానినాదముక్
శరధి, యకాలమృత్యు వనఁజాలెడివేలలచే మహాభయం
కరజలరాశిమగ్నహరికాండసముద్ధరణంబు లైననీ
కరములుగావె మా కభయకారణముల్? పవమాననందనా!

గీ. ఉరగభోజనార్థంబయి శరధిపైన
నెగయుతార్క్ష్యపక్షంబుల నెనయునట్టి
సత్వజవశాలి కీసూక్ష్మసాగరంబు
గోష్పదసమానముగద? యకుంఠసత్వ!

పావనీ! లెమ్ము. కార్యభార మూనుము. ఇప్పటికే కాలవిలంబన మైనది.

ఆంజ:- తాతా! మీయాశీర్వచనంబునను శ్రీరామచంద్రమూర్తి యనుగ్రహంబునను నా కసాధ్య ముండునా? (అత్యుత్సాహముతో హుంకరించి మేనుఁ బెంచును.)

అంగ:- ఆహా! ఏమి యీజగత్ప్రాణపుత్రునియాకృతి! భయంకరాద్భుతముగా నున్నది.

మ. తలపూర్వై, భుజకీర్తులై, ప్రథితముక్తాదామతుల్యంబులై,
వలనౌ జన్నిదమౌచు, సూత్రమగుచు, న్భాసిల్లు పాదస్థభూ
షలబోలె న్గ్రహతారక ల్హనుమ సుష్ఠంబౌ నయఃకాంతికిం
దులయౌ సుందరభీషణం బగుచు నస్తోకాకృతిం బొల్చెడిన్.

ఆంజనేయునినిజాకృతిఁ జూచుట క్రొత్తయగుట వెఱపుఁగొలుపుచున్నది. ఇట్టిభీకరప్రతాపమూర్తి కీసముద్రము గిముద్రమెంత? త్రుటిలోఁ గార్యసాధకుఁడై రాఁగలఁడను ధైర్యము వొడముచున్నది. ఏమో యనుచున్నట్లున్నది. వినెద (ఆకసమువంకఁ జూచును)

హను:-

సీ. భోగలోకం బెల్లఁ బొడగట్టునట్లుగా శరధిజలము చేతఁ జఱచుదునొక్కొ?
ఊర్ధ్వలోకంబుల నుడికించుపూనికిని మ్యమణిపర్యంతంబు దుముకుదునొకో
రావణులంకాపురంబుఁ గాలను దన్ని మన్నిటిలోపల ముంతునొక్కొ?
రావణుశిరముల గ్రసియించి రఘురాముముందట నిడి భక్తి మ్రొక్కుదునొకో

గీ. కులగిరులఁ బిండిఁజేతునో? కుతల మెల్లఁ జంచి చెండాడి వైతునా? చెప్పు తాత!
యాంజనేయునిశౌర్య మేమనితలఁచితొ? కాంచఁగలవారి లెల్లయు కపులు నేఁడు.

జాంబ:- రుద్రసమానా! పావనీ! నీవెంత కైనఁజాలుదువని నే నెఱుఁగనా! సీతాన్వేషణకార్యము మున్నిడుకొని యిప్పుడే యింతశౌర్యవిజృంభణ మేల? రామరావణయుద్ధకార్యభార మంతయుఁ గంఠమాత్రగ్రస్తము లగునీభుజస్కంధములనే యుండ నింతదుందుడు కేల? లెమ్ము. పయనము గమ్ము. సుగ్రీవాజ్ఞ పురస్కరిం

చుకొని శ్రీరామాంగుళీయకము శిరంబున వహించి సీతాన్వేషణ
మొనర్చి నాథునివిరహంబునఁ గుందునాసాధ్వికి మున్ముందు ప్రాణ
దానంబొనర్చి శుభవార్తావహుండవై మఱలిరమ్ము. నీరాక కెదురు
చూచుచు నిచ్చటనే యుందుము.

హను:- (జాంబవదాదులకు నమస్కరించి లేచి) తాతా ! శతయోజన
లంఘనోద్వేగమున కీసమతల మోర్వదు. ఈకన్పట్టుమహేంద్రాద్రి
దృఢగ్రావపరీతమగుట లంఘనోద్వృత్తి కొంతయు ననువు. దానిపై
కెక్కి లంఘించెద. (ఇంచుక పరిక్రమించి)

గీ. రావణోన్మూలనక్రియారతిని నక్క
జుండు పంపెడిదూతనా, సొంపుమీఱి
సురలు వినుతింప దనుజులసొంపు దక్క
నాదుమూర్తి నభమునఁ గానంగ నగును.

యువరాజా ! అనుజ్ఞయా ?

అంగ:- రామభక్తాగ్రేసరా ! శుభంబున నేఁగిరమ్ము.

హను:- తాతా ! పోయి వత్తునా ?

జాంబ:- క. చతురకుమారా ! పంచమ
గతిఁజని ప్రప్రథమపుత్రిఁ గాంచి తృతీయ
ద్యుతి నద్వితీయము సమం
చితగతిఁ దరియించి మమ్ము శీఘ్రము కనుమీ.

హను:- మీరెల్లరచే ననుజ్ఞాతుండ నైతి. పోయి వచ్చెద. (కుప్పించి
నిష్క్రమించును)

అంగ:- ఆహా ! ఏమి విశ్వరూపము ! ఏమి బలప్రదర్శనము ! ఏమి
జవప్రకటనము ? వాయువేగం బనిన నిదికదా !

సీ. ఒక్కుమ్మడి పదంబు లూదిన గ్రిశంబు పటపటనిన దానఁ బగులువాఱె
పదహతి భూరుహప్రతతి విధూతమై పెళపెళ మనుచును విఱిగి కూలె
గమనవేగమున సాగరచారసత్త్వసంతానంబు 'ఉస్సని' తల్లడిల్లె
వాయువేగంబునఁ బాఱుకతంబున 'సుయ్యని' తరఁగలు చూపెఁ బధము

గీ. హాటకాచలవిధమున, నంబుదంబు కరణి, దూరవిమానంబుసరణి, యసుర
బాలలీలాపరిభ్రమణపటు మనంగ శిక్కయనఁ దోఁచి తోఁచనిశక్తిఁ గనిరొ.

జాంబః- యువరాజా ! అటేమి చూచెదవు ? ఈనగంబుఁ జూడుము.

ఉ. ఇంతకులేని నిర్ఝరము లెన్నొ నినాదముఁ జేయఁ జొచ్చె బ
ల్వింతగుకందరంబు లవలీల నదృశ్యగతి న్దొలంగె, నీ
ప్రాంతమునందు మిన్నదియుపాదపము ల్మటుమాయె మయ్యెగా!
యొంతటిమార్పుమారుతి ఘటించె మహేంద్రనగంబునందుసా?

మన మామారుతియాగమనము నిరీక్షించుచు నట నిలిచి
యుందము. రండు.

(అందఱు నిష్క్రమింతురు.)

(యవనిక జాఱును)





# శ్రీరామోద్యోగము



## చతుర్థాంకము.



### 1. స్థలకము - లంక, సముద్రతీరము.

హను:- మెల్లఁగా లంకోత్తరతటంబుఁ జేరితి. నామహాకారంబుఁ జూచిన రక్కసులు నాచుట్టు మూఁగుదురు. కావున సామాన్య రూపముఁ దాల్చెద. (సామాన్యరూపముఁ దాల్చి) ఆహా! అతి చిత్ర మతిచిత్రము! సత్యపరాక్రముఁడును ధర్మాపరావతారుఁడు నగుశ్రీరామునకుఁ బశుపక్ష్యాదిసమస్తజీవరాసులు సాయ మొనర్చు చుండఁ గార్యార్థు లగుసుర లొనర్చు టేమివింత ?

గీ. మానవునితత్వ మెఱుఁగంగఁ బూనుకతన
విషమ మైనపరీక్షఁ గావింత్రు సుర ల
టన్నవాక్యంబు నేఁ డిట స్వానుభవము
వలన సురసముఖంబునఁ దెలియఁగంటి.

రామకార్యపారతంత్ర్యంబునను, నాజనకు ననుగ్రహంబునను, ధర్మసత్త్వంబునను నాసురసాసాగరంబుఁ దరింపఁగలిగితి. ఆయమ యెడ నాసంకుచితరూపమే యొంతయుఁ గార్యకారి యైనది. జలధి జడరూపమయ్యును నాకు స్వాగత మొసంగ మైనాకుఁ బంపెఁగదా!

చ. వలనగుకార్యము న్సలుపువారికి, సాయ మొనర్పఁబూను స
ల్లలితగుణాన్వితావళికి, లాభము లబ్బు నటన్నమాట వ
ట్రిలె నిట, నాకు సాయ మొసరింపఁగ వచ్చుహిమాచలాత్మజుఁ
దెలిసి సురేశుఁడే భయముఁదీర్చి యనుగ్రహబుద్ధిఁ జూడఁడే!

తొల్లి నాతండ్రి నగభేదిహస్తగతుండు కాకుండ నీతని సాగరంబున దాచి రక్షించినకృతజ్ఞతచేతఁగదా నేఁడు నాకుఁ బ్రత్యుపకారబుద్ధి స్వాగతమొసఁగినది ? 'శ్రేయాంసి బహువిఘ్నాని' యనునట్లు ఛాయాగ్రాహియగుసింహికయే నామందగతికిఁ గారణమైనది. లేకుండిన సముద్రమునీవలియొడ్డు నెప్పుడో చేరియుందును. ఎట్లైన నేమి ? రాక్షసాహారమున సింహిక ప్రథమకబళమైనది. ఇంక నెన్నియడ్డంకులు రానున్నవో ? కానిమ్ము. రామానుగ్రహ ప్రవర్ధితతేజస్సామర్థ్యయుక్తుఁడ నగునా కేమి ? (కొంతవడి పరిక్రమించి) ఆహా! ఏమి సుందరోపవనములు? ఏమిపచ్చికబయళ్ళు ! ఏమి సౌరభోపేతపుష్పరాగము ! ఏమి తేటనీటివాఁకలు ! ఆనగంబునకు శృంగత్రితయము కలదు; ఓహో యదియే కాఁబోలు త్రికూటాచలము. ఆగిర్యగ్రపట్టణమే లంకాపురము. ఎంతకమనీయముగ నున్నది!

సీ. సుకృతవిశేషభాసురపుణ్యపూరుషావాసమౌ స్వర్ధామవాటిక యన
సత్యలోకోన్ముఖనిత్యసత్యవ్రతపథికశ్రాంతమహాప్రప యనంగ
గగనపర్యటనభాస్కరశీతకరబింబవిశ్రామకరనభోవేశ్మ మనఁగ
జంభాసురారివర్షాకాల మంబుదస్థలి వసించెడిభర్మసౌధ మనఁగ

గీ. భాస్కరాస్తమయము శశిప్రభవ మధ్య భాసితంబగు సాంధ్యదీపం బనంగ
భర్మశిఖరవప్రోజ్జ్వలప్రభల మించి చూపునకె వెలుఁగయ్యె లంకాపురంబు.

వైరినగరమునఁ బట్టపవలు సంచరించుట చారానుకూలము కాకుండుట నీసముద్రతీరమున నించుక కాలయాపనమొనర్చితి. చారసంచారయోగ్యం బగుసాంధ్యకాలము సమీపించినది.

గీ. అంధకారపక్షంబుల నల్లనల్లఁ
గప్పుచున్న దజాండంబు కాలపక్షి
జ్యోత్స్నఁ బరికించి భూరుహస్తోమములను
జేరులోపుగా లంక కేఁ జేరువాఁడ.

(ఇంచుక పరిక్రమించి) అసమానశౌర్యవిత్తముఁ డగురాముని యిల్లాలి దొంగిలితెచ్చినకతమున లంక యెంతయుఁ బరిరక్షితమై

యుండునని తోఁచెడిని. కావున నీసహజరూపంబునఁ బోయిన వారికిఁ గానఁబడకపోవుట కల్ల. కావునఁ బిల్లినై లంకఁజొచ్చు టెంతేని యుక్తమని తోఁచుచున్నది. ఆహాహా! ఏమిభర్మవప్రము! ఏమి మణిమయకవాటంబులు! ఏమియుత్తుంగహర్మ్యములు! శ్రీరాముఁ డెంతపరాక్రమవంతుఁడైన నీదుర్గముఁ దేరిచూడఁగలఁడా? అయినఁ గానిమ్ము. ఈదుర్గద్వారముఁ దరిసి పురప్రవేశమొనర్ప యత్నించెద. ఎవరు నాకెదుట భయంకరరూపముఁదాల్చి నా మీఁదికి వంగిచూచునీరక్కసి?

సీ. దేవాలయాగ్రసందీప్తమహాశిఖరంబు శీర్షకమ్మై వింతచెలువు గులుక
వివిధసభాగ్రశోభితభర్మకుంభము ల్స్వర్ణకుచములై సరసమూఁడ
కాంతంబులైనదుర్గద్వారకంబము ల్కమనీయచరణయుగంబు గాఁగఁ
దపనీయమహాధ్వజస్తంభము లుల్లసద్బాహుద్వయస్థితి వోహటింప

గీ. పద్మరాగద్యుతి విశాలభాసమాన నేత్రయుగళంబు నావైపు నిక్కి, వంగి
చూచుచున్నదరాక్షసుదతియనుచుఁదోఁచు, నేమనునో వాదులోఁ ద్రవఁబోను.

(అనిసాగి ద్వారము నెక్కఁబోవఁగా)

లంకాధిదేవత:- ఓరీ! ఎవఁడవురా కోఁతీ? మాకోటవాకిలి దరియుచున్నావు? ఎక్కడికిఁ బోవలెనని? నిలునిలు నిన్నుఁబట్టుకొని తొండవలెను, బుడ్డపెణుచువలెను, నల్లివలెను పేనువలెను నలిపి వేసెద. రాత్రియని పవలని లేక విచ్చుకత్తులపారాయున్నది తెలియువా? దేవతలకైన నెవ్వరికైనను బో వీలులేదు. లంకలోని కెట్లు పోఁదలఁచినావు?

హను:- కాంతా! నాచరిత్ర మెఱిఁగింతుఁగాని నన్నిట్లడ్డగించు నీవెవరో ముందు చెప్పుము.

లంకా:- ఓరీ! కోఁతీ నేను రావణాసురునిముదల లంకను గాచు లంకిణినిరా.

హను:- ఓహో లంకిణివా! లంకిణీ! ఉత్తుంగగోపురప్రాకారసమన్వితముగులంకను జూచిపోవచ్చితిని, పోయి చూతునా? ఇప్పుడే మఱలివచ్చి నాదారిఁబట్టెద.

లంక:- ఓరీకోతి ! నాతో వేళాకోళములా ! నన్ను గెలువక లంక లోని కెట్లుపోవలెననుకున్నావు ? అడుగుఁదప్పితే యూరడికొస్తా. కదలు మావలకు (అని చేత హనుమంతుని జెఱచును)

హను:- (స్వగతము) ఇది స్త్రీ. శౌర్యముఁజూపిన స్త్రీహత్యవచ్చును. కావున నొకచెయ్యిఁజూపెద. (ప్రకాశముగా) లంకా ! అయితే కాచుకో. అశనిసమాన మగుపిడికిటిపోటు. (ఎడమచేత నొక గుద్దు గుద్దును)

లంక:- (క్రిందఁబడి గిలగిలఁ దన్నుకొనుచు) మహావీరా ! నన్ను జయించినావు వానరవీరా ! నన్ను కరుణించుము. మునుపు బ్రహ్మ దేవుఁడు రాక్షసులకు వరాలిచ్చినప్పుడు ఎప్పుడు నీ నొకకోతిచేత దెబ్బదిందువో అప్పటినుండి రాక్షసులకు నాశనమని చెప్పెను ఆకాలము వచ్చినదికాఁబోలు. బ్రహ్మవాక్యము తప్పుటయే! నే నిఁక బ్రదుకను. యథేచ్ఛముగా లంకఁజొచ్చి సీతమ్మను జూచిపో.

హను:- (ఉత్సాహముతో) ఇఁక నేమాత్రి మాలస్య మొనరింపఁ గూడదు. సీతాన్వేషణార్థము బయలుదేరెద. రామకార్యధురంధరు లందఱు పురుషార్థసంపాదకు లగుచుండ నేనుమాత్ర మేల సఫలీకృతయత్నుఁడఁ గాకుందు ?

గీ. ముక్తిని జటాయు, నలరాజ్యమును రవిజుఁడు
పక్షయుగళి సంపాతి, నిర్భయచరణము
సీతుమలసుతుఁ డొంద నేఁ జేసెడికృషి
సఫల కాకుండునే రామచంద్రుకృపను ?
జై శ్రీరామచంద్రప్రభువుకు జై. (అని దుముకును)

## 2. స్థలకము - లంకాపురద్వారము.

(జుగుప్సతోడ హనుమంతుఁడు కూరుచుండియుండును.)

హను:- శ్రీరామరామ ! ఎంతవెదకితి నెంతవెదకితి? రావణహార్మ్యాంతఃపురములను, కుంభకర్ణు మందిరంబును, విభీషణుని సదనమును, మంత్రివర్గగృహములను, రాక్షసముఖ్యనిశాంతములను, సర్వభవ

కంబులను, పుష్పకవిమానమును, పాకశాలలను, రథ్యకోట్లను, పుష్పవనములను వాడవాడలను గాలించి వెదకినను రాముదేవి జాడమాత్రము కానుపించినది కాదు. రావణాంతఃపురమున నొక సకలసులక్షణోపేత యగుయువతిఁ గాంచి జానకియా యని యించుక శంకించితిని. ఆవిడ మధుపానమత్తయై యొడ లెఱుఁగకుండిన కతంబున శ్రీరామవియోగసంతప్తహృదయ యగుసీతాదేవి పానమున కెన్నఁడును జిక్కదనియు రావణాంతఃపురమునఁ దనదీనదశయం దంతటిసుఖనిద్రఁ జెందుననుకొను టనౌచిత్యమని తలంచి యాయమ రావణునిపట్టమహిషిగా నిర్ధారణ చేసితిని. ఈనాపడిన శ్రమ కంతటికిని ఫలితము నిద్రాపరవశపరాంగనాదిగంబరరూప దర్శనమే యైనదిగాని సర్వపాపవ్యపేత జానకీమాతపదదర్శన భాగ్య మీమందభాగ్యునిభాగధేయంబు గానందున కెంతయు వగవవలసియున్నది. ఇఁకఁ గర్తవ్య మేమి ? రిక్తహస్తంబుల మహేంద్రనగోన్ముఖుండనై సంద్రముఁ దాట నుంకించుటయా ! ఎన్నఁటికిని గాదు. జానకీమాతృశుభోదంతోల్లసితహనుమద్వదన భాస్కరబింబసందర్శనకుతూహలముతో కపిప్రవరహృదయాబ్జంబులకు దుఃఖోదంతరాహుగ్రహదర్శన మొసంగ నుత్సహింపను. ఉత్సహింపను. మైథిలీవృత్తాంత మెఱిఁగి సత్వరమ వచ్చెదనని యాత్మశ్లాఘాపరాయణుండనై వాగ్దాన మొనరించి రిక్తవచన రచనవృద్ధభల్లుకేశ్వరాంగదుల త్రపావిహీనతఁ జూడఁగల్గుదునా? పోయిన నేమి ? కానుపింపనిజానకికై యెన్నిదినములు వెదకిన నేమిఫలము ? రావణాకృష్టయై గగనతలంబున నెగయునప్పు డావేగంబునకు సోలి శరధిఁ బడియుండునా ? కామి యగురావణుఁడంతటియజాగ్రత్త నుండఁడు. పరమసాధ్వియై తనవంకఁ జూడకుండమిని గోపమున నాతఁడు చంపియుండునా ? కామి తనకోరికఁ దీర్చుకొనక చంపఁదెగింపఁడు. రావణునిదాసు లేమేనియుపాయ మొనర్చియుందురా ? భర్త వలచినకాంత కపాయముఁగలిగించుట ప్రాణాపాయమని యట్లొనర్పఁజాలరు. రావణుఁ డెచ్చటనేని

దాచియుండునా ? లంకాపట్టణమంతయు బీసుఁబోక వెదకితి. ఇం
కెక్కడ దాచును. దురూహ్యముగ నున్నది. జానకీవృత్తాంతముఁ
గొనిపోనక నేను మఱలిచనిన జానకీవియోగంబున శ్రీరామచం
ద్రుఁడు మగ్గును. అగ్రజునిదుస్థితికి వగచి సౌమిత్రి మరణించును.
పరమమిత్రులస్థితికి వగచి యర్కజుఁడు మ్రందఁగలఁడు. వానర
ప్రభుస్థితికిఁ జింతించి కిష్కింధాప్రజ లంద రంత మొందుదురు.
శ్రీరామలక్ష్మణులు సమయుట విని యయోధ్యారాజకుటుంబమును
ప్రజలు మృతులగుదురు. అర్కవంశజీవికాసాధము ప్రస్తుతము
నాకరణీయమూలబంధముపై నాధారపడియున్నది. రావణునిఁ
బట్టుకొనిపోయి రామచంద్రునిముం దిడుదునా ? అట్లొనర్చినను
సీతోదంతరహితుఁడనై వచ్చినాఁడని కినిసి శాపాగ్ని మారణ
హోమ మొనర్చక మానఁడు. కావున సీతోదంతయుక్తుఁడనైన
మఱలిపోవలసినది; లేనియెడల నిచ్చటనే నిలిచి ప్రాయోపవేశ
మొనర్పవలసినదే కాని మఱియొకపధికము లేదు. అట్లనుకొనినఁ
బ్రాణహత్య నారక హేతువు. బ్రతికియుండిన శుభములఁ బడయ
వచ్చుననికదా యార్యోక్తి? (కనులు మూసికొని) కర్తవ్య మేమి?
తండ్రీ ! శ్రీరామచంద్రా ? నీదాసునకు మార్గదర్శివైకావా ?
త్వదేకశరణ్యుఁడనుగదా ? కరుణించి యుపదేశింపనర్హము. (అని
కనులు తెఱచి) ఏనెలవులనైన వెదకి మఱచితినా? ఈమహోన్నత
దుర్గద్వారము నెక్కి చూచెద. (ఇంచుక పరిక్రమించి • ద్వారా
రోహణము నటించి) అదిగో యచ్చట నొకమహోన్నతాశోక
ద్రుమవనము కానసగుచున్నది. అది యిప్పటికి వెనుకఁబడి
నది కాదు. దానినిమాత్ర మేల కొఱఁతపెట్టవలయు ? వసు
రుద్రాదిత్యచంద్రానిలానలానుగ్రహముతో శ్రీరామలక్ష్మణసుగ్రీ
వానుగ్రహ మిందువఱకు నా కేమికొదువ ? అచ్చటను గాన్పిం
పదేని తదుపరి దండోపాయంబున రావణునిమద మడంచి రాక్షస
దుఃఖనిస్వనమంగళధ్వానములతో జానకీరాములఁ గూర్పయత్నింతు.
ఇఁక నశోకవనోన్ముఖుఁడ నయ్యెద. శ్రీరామచంద్రపరమాత్మకు జై.

(యవనిక జాఱును)

## 3. స్థలకము - అశోకవనము.

(దుఃఖిత యగుజానకికి ఏకజట ద్విజట త్రిజట యను మువ్వురు రాక్షసాంగనలు కాపుందురు.)

హను:- (సూక్ష్మకపిరూపంబునఁ బ్రవేశించి స్వగతము) ఆహా! సకలానందసంధాయకం బగునీయశోకవనం బంతయు నారసితిఁ గాని మైథిలిజాడ కానుపింపలేదు. ఇచటఁగూడ విఫలమనోరథుఁడ నగుదునా యేమి? (కొంత పరిక్రమించి) ఏ మాసహస్రస్తంభ సౌధముచెంగట నెవరో యొకవనిత కూర్చుండియున్న ట్లున్నది. నే నీవృక్షమార్గంబునఁజని పరికింతు. (కొంతసాగి సీత కూర్చుండి యున్నచెట్టుపై నెక్కి) ఆహా! నివురుగప్పిన నిప్పువలెను, మేఘాచ్ఛన్నశశాంకునిగతి, అంబుదగర్భస్థతటిల్లతరీతి గుఱితింపవలను పడనిరీతి నిజసౌందర్యంబు గప్పుచు వేడినిట్టూర్పులచే నధరోష్ఠ బింబమును సంతతబాష్పధారలచే వక్షోజాంకంబులను, నిరంతర పరధ్యానపరత, యోగినీత్వపరిగ్రహణమున నసంస్కృతదేహ సౌందర్యమై యొప్పారుసీసులక్షణాంకిత శ్రీరామునిరాణియాయని సందియము వొడముచున్నది. (నిదానించి చూచి) ఈసాధ్వి ధరించినవసనము మాసియు సుగ్రీవసాన్నిధ్యమున నగలు ముడువఁ బడినవలువ ననుకరించుచున్నది. అందు ముడువఁబడినభూషణంబు లీయమదేహముపై లేక వాటినొక్కులుమాత్ర మించుక కాన నగుచున్నవి. వేయేల యీమాసదశకము కార్శ్యము నొందుటచే మార్పుఁజెందెనేగాని యాదినమున ఋష్యమూకముపైగా రావణునిచేతఁ గొనిపోఁబడుచుండిన దీవనితయే. మా శ్రీరామచంద్రునిపోలిక లీయమవద్దఁ గొన్ని కాన్పించుచున్నవి. ఈసాధ్వి వైపు చూచుకొలఁదిని సంశయమేఘము లంతరాత్మనిర్ధారణ భానూదయంబున పటాపంచ లగుచున్నవి. ఆహా! ఈమెయే యాజానకీదేవి యగునెడల నీకాంతామతల్లికై కదా విరాధ, ఖర, త్రిశిరులందొట్టి పదునాల్గువేల జనస్థానరాక్షసహాతకు లంత

మొందిరి? ఈసాధ్వినిమిత్తముననఁగదా వాలి నిహతుఁడై సకల వానరరాజ్యము రుమాతారాసహితంబుగ క్షణమాత్రంబున సుగ్రీవప్రభునికి వశపడినది? భూషణభూషితయయ్యు వనితా ప్రాణభూషణప్రియ మగుప్రాణప్రియువియోగంబునఁ దేజో రహితభూషణయై వలవంతలపాలఁబడియున్నది. జగన్మోహన రూపుఁ డగుశ్రీరామునియందే చిక్కినకతంబున నీమె యక్షి పద్మము లర్ధనిమీలితములై యీసుందరోపవనంబునుగాని, రమ్య హర్మ్యంబుఁగాని యీబాహ్యప్రపంచమునుగాని బొత్తుగాఁ గాంచుచున్నట్లు లేదు.(బాగుగఁ బరికించి)ఈయమ యొకతెయే కాదు. అతికురూపులౌ రాక్షసాంగనలుగూడఁ గాపున్నారు.

గీ. పెద్దపులిమోములును, గడుపెద్దకడుపు,
లురుపులౌ కర్ణనాసిక, లూరువులును
గలిగి వన్యమృగార్భటుల్ సలుపువీరి
నడుమ నెటులున్న దీమృగీనయన యకట !

అహహో! శశాంకుఁడు జానకిజోడను నాకు విస్పష్టముగ నెఱింగింప పైకి పైకి వచ్చుచున్నాఁడు. ఏ మా భేరీభాంకారములు? ఏ మా కరదీపికాసహస్రప్రకాశము!

(తెరలో)

జంభాంతకగర్వాగపవిధరా పరాక్. సమ్మర్దితాష్టదిక్పాలా పరాక్. విజితచతుర్దశభువనా పరాక్. మందోదరీహృదయాబ్జ భాస్కరా పరాక్.

హను:- ఓహో! వందిమాగధసంస్తూయమానుండై రావణుండే వచ్చుచున్నట్లున్నాఁడు. నేను వీని కగోచరుండనై యీపాదపంబుననే డాగి వీనినడవడి గమనించెద. (నక్కును)

(ధాన్యమాలినీయుక్తుఁడై రావణుఁడు ప్రవేశించును)

ఏకజట, ద్విజట, త్రిజట:- (నమస్కరించి ప్రక్కన నిలుచుందురు)

రావ:- (హారముల సవరించుకొనుచు మందహాసముతో)

ఉ. వాడియుఁ బూర్ణచంద్రుని లవంబును గైకొనఁనట్టిమోముతోఁ
జేడియ! 'రామరామ'యని చింతను వందురుదేల ? కాన న
ల్లాడెడురాఘవుండటు విలాసవతీ! జలరాశి దాటి ని
న్గూడి సుఖాబ్ధిఁదేల్చునటె? గోల!వృథాఽశ వహింప నేటికిఁ ?

మ. సిరికి న్దావల మాచు, రాజ్యవిభవశ్రీఁ జెందఁగా సర్వమా
వరరూపంబును యోగినీత్వమున విధ్వంసంబు నొందింప నే
ల ? రతీసుందరరూప ! ని న్వలచి యిల్లాలి న్విసర్జించునీ
స్మరనారాచవిభిన్న**మా**నసుని సమ్మానార్హు నీక్షింపవే.

క. పలుమాట లేల చిలుకల
కొలికీ ! ననుఁ జెట్టఁబట్టఁ గొఱతవడని ని
స్తులభోగంబుల సవతులు
కొలువఁ గ్రీడింపఁగలవు కువలయనేత్రా!

హను:- (కోపంబునఁ జేతితో బెదరించుచుఁ బండ్లు పటపటఁగొఱుకుచుఁ దిరిగి **మా**టున నక్కును)

జాన:- (గడ్డిపోచను జేతఁబట్టుకొని)

గీ. వర్షఋతువౌట నినుఁడు నీవంకఁ గనమి
తోయమున నుండి మిడియుచుఁ ద్రుళ్ళెదేల ?
'జలధి నింకించుచండభాస్కరుఁడు మ్రోల
నిలిచిననుగాదె కానవా నీచుచేత ?

గీ. రామునర్ధాంగి, నాతనిరాకఁ గోరు
సతి, నకామను గవయఁగ సౌఖ్య మగునె ?
రాఘవాస్త్రాగ్నిరక్షితరమణిఁ దరియ
సాహసించెదే తృణమ ! యుత్సాహమునను ?

స్వభార్య లెట్లురక్షణీయలో పరభామ లట్లుకారా ? బుద్ధిఁ గలిగి యింతటనైనన న్నాజగదేకవీరునికి సమర్పించి క్షమార్పణఁ గోరుకొనుట శ్రేయోదాయకమనుట చర్వితచర్వణముకదా ?

ఏటి కాలోక్తి కపీరునియెడ ద్రోహమొనర్చి సపుత్రమిత్రబాంధవ ముగ మ్రగ్గ యత్నించెదవు ?

రావ:- ఏమని పేలితివి ? అనరాధముఁడు రాముఁడా నన్ను సపుత్ర మిత్రబాంధవముగ మ్రందించునది ? వైరిని నాయెదుటఁ గొం డాడినందులకు ని న్నీచంద్రహాసముపా లొనరించెద. నీ కెవ రడ్డ మువత్తురో చూచెద. (కత్తిఁ బెఱికి పైకి దుముక ధాన్యమాలిని వారించి)

ధాన్య:- చతుర్దశభువనవిద్రావణా ! ఆహా ! ఒకబక్కనరకాంతపై ననా నీశౌర్యవిజృంభణము ? బాగుగ నున్నది. అష్టదిక్పతులని భ్రమించితివా ? ఇందుఁడని తలఁచితివా ? నిన్ను సర్వసుఖం బులఁ దేల్ప నే సిద్ధముగ నుండ నీ నీచమానవాంగనపైఁ బడ నింతపరితపించెద వేల ? మఱలుము.

రావ:- (యించుక శాంతించి) సీతా ! వినుము.

శా. సంతోషంబున నన్వరించి సకలైశ్వర్యంబులం బొంద నూ
హింతో ? కాదని క్రూరరాక్షసులచే హింసాతతి న్జెందుచు
న్నంతాపింపఁదలంతువో తెలుప మాసద్వంద్వకాలంబు నో,
కాంతా ! యిచ్చితిఁ బై శుభాశుభములం గాంచంగ వర్తింపుమీ.

ఓరాక్షసాంగనలారా ! ఈరెండుమాసములలోపుగా నీకాంత తనమానసంబు మార్చుకొననియెడలఁ గడికండలుగఁ గోసి దీని నాహరింపుఁడు. మీశక్త్యనుసారము బోధించి చూడుఁడు నేఁ బోవుచున్నాఁడ. (ధాన్యమాలినీయుక్తుఁడై రావణుఁడు నిష్క్ర మించును)

హను:- (సంతోషాతిశయమున)

గీ. అరరె ! కంటిని జనకాబ్ధిహారిని, పంక్తి
రథునియగ్రస్నుషను, మహారాజమకుట
హీరబంభరవేల్లితాహీనపాద
పంకజను, రామచంద్రార్ధభాగము నిట.

ధన్యోస్మి. కృతార్థోస్మి.

ఆ. సీతఁ బాసి కడుకృశించు శ్రీరాముని
లఘువిధంబుగాఁ దలంచి తప్పు
సీతఁ గాంచుమీఁద శ్రీరాముఁ డీపాప్మఁ
బాసి మనుటఁ గఠినభావుఁ డంచు.

ఈరాక్షసు లందఱు మేలుకొనియున్నారు. వీరు నిదురించు వఱకు డాగియే యుండెద.

త్రిజటః- నాకుఁ జాల నిద్రవచ్చుచున్నది ; కొంచెము పరుండెద.
(పరుండి గుఱ్ఱుపెట్టి నిదురించును)

ఏకః- సీతా ! రాముఁడో రాముఁడో యని కలవరిస్తావు. రాముఁడు సముద్రము దాటఁగలఁడా ? రాగలఁడా ? ఎందు కీభ్రమ ?

ద్విజటః- సీతా ! రాముఁడు లేఁడు. గీముఁడు లేఁడు. పదునాల్గులోకా లేలేరావణాసురబ్రహ్మను పెండ్లి చేసుకొని సుగించేందు కెవరివశము?

ఏకః- ఈలాంటిదే బెమొగాని కేనా ఆలాటి అదృష్టం ?

ద్విజటః- నామాట యినుః రావణాసురుణ్ణి వరించానని తల ప్రూపు. నీస్థితి చూసుకో. గరుడగంధర్వకిన్నరయక్షరాక్షసులు నీకను చూపు కెదురుచూస్తూ బంగివొంగి సలాంచేస్తారో లేదో ?

ఏకః- వాండ్లేందే ! రావణాసురయ్య మొక్కఁడూ ?

ద్విజటః- పెద్దవాండ్లమో చిన్నవాండ్లమో సెప్పేము. ఇని అట్లా చెయ్యి.

జానకిః- (చెవులు మూసికొని) శ్రీరామ ! రామ ! ఎన్నటికి నాకీకర్ణ కఠోరవాగ్జాలములు వినఁబడకుండఁబోవునది? అబ్బా ! దుర్భరము.

ఏకః- (కోపముతో) ఆకూఁత కుయ్యొద్దని యెన్నిమాట్లు సెప్పినా యినవు. మళ్లీ కుయ్యి యూక త్తిపోటు కాచుకో. (కత్తి చూపును)

ద్విజః- మెల్లగా సెప్పేకొద్దీ పేల్తావు. ఒడియాన్ని నవిలినట్టు నవిలేస్తా. (గద్దించి పై దుముకఁబోవును)

జానకిః- (నిర్వేదముతో) ఓరాక్షసకాంతలారా ! నన్నేల యిట్లు గద్దించెదరు ? నాహృదయపద్మాసనాసీనుఁడై యున్న నాప్రాణకాంతు

శ్రీరామచంద్రుఁ డక్క సన్నటికిని, ఎట్టికష్టపరంపరలనైన మఱి యొక్కని తలఁపనని త్రికరణశుద్ధిగా ముమ్మాటికి నమ్ముఁడు. మీరు నన్నేమి చేయఁగలరు ? ఈపాంచభౌతికశరీరమునకు బాధఁ గలిగింతుమనియా బెదరించెదరు ? నే నావంతయు జంకను.

ఏక:- మాకు తెలేదూ నీవు గుండెలు దీసినబంటువని ?

జాన:- క్రౌర్యంబునను రోసంబునను నావైపు చూపెడిమీకఠారులచే నన్ను కడికండలుగఁ గోసిన పరమసంతోషమున సహింతుఁగాని యిట్టికర్ణశూలాయమానము లగుమాటలచే నలయింపక శ్రీరామ నామధ్యానమున కంతరాయముఁ గలిగింపకుఁడు. మీ కిదె మ్రొక్కెద. (అని మ్రొక్కును)

త్రిజ:- (కలవరించుచుఁ బొర్లి లేచుచు) ఏమే యేకజటా ! ఓసీ ద్విజటా ! మీరొందఱో నొంటికాలిమీద నారాముదేవిపై కుఱుకుచున్నారటే. ఉడుగు డుడుగుఁడు. ఆదేవిని శరణుఁజొచ్చి యను గ్రహపాత్రలు గండు.

ఏక, ద్విజ:- త్రిజటా ! ఏమిలేదు, మనపెబువును పెండ్లాడమని చెప్పుచున్నాంలే.

త్రిజ:- ఏడిచినట్లే యున్నది.

ఏక:- ఏమమ్మా ! అట్లంటివి ?

త్రిజ:- కాకేమున్నదే. నే నొకకలగంటిని వింటిరా ?

ఏక, ద్విజ:- అమ్మా ! నీకల యేమోచెప్పుము విందము.

త్రిజ:- ఏమని చెప్పను ? శ్రీరామచంద్రుఁడు జానకీసమేతుండై శ్వేత మాల్యాంబరధారియై పట్టపుటేనుంగునెక్కి యుత్తరాభిముఖుఁడై పోవఁగంటిని. ఆతనివెంబడి విభీషణుఁడు నట్లే పోవఁగంటి. రావణుఁడు సబంధుఁడై తైలలిప్తాంగుఁడై మత్తెక్కి తైలంబు గ్రోలుచు ఖరారూఢుండై దక్షిణాభిముఖుండై చనుచు నంజనాద్రిఁ బోలు నొకకాంతిచే నాకృష్టకేశుఁడై జంబాలపటలియందుఁ గూలినట్లు కలఁగంటి. వేకువ వచ్చినకలలు తప్పవందురు. ఇది తప్పనటులఁ

బోఁచదు. ధర్మమార్గావలంబి యగు శ్రీరామునకు విజయము, రావ ణునకుఁ బరాభవోపేతమర్మరణము తప్పదు. రాముని దేవియెడల సకరుణులై జాగరూకత నుండుఁడు. ఇంకను గొంతవార్గ్రస్థ కలదు. ఇంతనైన నిదురింపుఁడు.

జాన:- ఏమీ వామపార్శ్వమెల్ల నిట్లదరుచున్నది ? త్రిజట స్వప్నోన్ము ఖముగ నున్నదే ? ఏమైనశుభము చేకూరునేమో ?

హను:- అబ్బా ! ఈరాక్షసులందఱు నిదురించిరి. జానకి కీవార్త యెఱిఁగించుట కిదియే యదను. ఏవిధి నుపక్రమింతు ? దనుజ మాయలచే వేగినకతంబున గీర్వాణవాణిఁబలుకుదునా కోఁతి కిది యెట్లువచ్చెనని శంకించునేమో ? మనుష్యభాషఁ బలుకుదుననినఁ బ్లవంగమునకు మానవభాష యెట్లలవడెనని నమ్మదేమో ? ఏమొ నర్తు ? ఏమైనను గానిమ్ము. శ్రీరామశుభోదంత మెఱింగింతు.

క. క్షేమము దశరథరాముఁడు
సౌమిత్రికి లగ్గు, కీశసంఘావృతుఁడై
యామిత్రజు సుగ్రీవుని
తో మైత్రి యొనర్చె, నిన్నుఁ దోడ్కొని పోవున్.

జానకి:- (విభ్రాంతయై) ఈకర్ణరసాయన మగువాక్యామృత మెచ్చటిది? (నలువైపులఁ బరికించి) ఎవ్వరును గానరారు. నా కేమేనిచిత్త విభ్రాంతియా ? మేల్కొనియుంటినా స్వప్నమా ? (నిదానించి) కాదు. స్వప్న మెన్నటికిని గాదు. నిజము. నిజము. నే వినినది నిక్కవమా ? రాక్షసమాయయా ? నా కే తోఁపకున్నది.

హను:- (స్వగతము) జానకీదేవి శంకించుచున్న ట్లున్నది. కానుపించెద. (కొంచెము సమీపించి)

హను:- తల్లీ ! దశరథరాముఁడు దండకాటవి నిన్నుఁబాసి రావణు నిచే నిర్జితుఁడై నజటాయువునకు నగ్నిసంస్కారము గావించి కిష్కింధఁజేరి భ్రాతృదారాపహారియైనవాలిఁ జంపి సుగ్రీవుని వానర రాజ్యపట్టాభిషిక్తు నొనరించి మిమ్మారయ ననేకకపివీరుల నలు

దిక్కులకుఁ బంపుచు మఱికొందఱితోడ నన్ను దక్షిణాశ కనిపె. నాపుణ్యంబున నిన్ను నేఁ బొడఁగంటి. ధన్యుఁడ నైతి.

జానకి:- (హనుమంతు నించుక పరికించి స్వగతము) ఇది నిజముగా రావణమాయయే. ఏవిధమునఁగాక యీపన్నుగడఁ బన్నినాఁడు. వీనిమొగముఁ జూడఁ బాపము వాటిల్లు (ఆవలిమొగ మగును)

హను:- మాతా ! దానవబాధలచేఁ దఱచు బాధింపఁబడుటచే మీ రిట్లు శంకించుట సమంజసమే. నేను నిక్కముగ శ్రీరామదూతను. నాయెడల మీకరుణావలోకనము ప్రసాదింపుఁడు.

జాన:- (స్వగతము) ఏమియోకాని యీవ్యక్తివాక్యంబు లవ్యాజం బుగ నామనముఁ గఱఁగించుచున్నవి. వీఁడు రామదూతయైన నాతనిగుణరూపముల వర్ణించుమని యడిగెద. (ప్రకాశముగా) రామదూతా ! శ్రీరామలక్ష్మణులరూపగుణంబుల వర్ణింపుము.

హను:- మాతా ! చిత్తము.

ఉ. నీలఘనాంగుఁ, డంబుజవిహానేత్రుఁడు, కంబుగళుండు, పీనవ
క్షోలలితుండు, జానుగతసుందరబాహుయుగుండు, విక్రమా
భీలుఁడు, శాంతవిగ్రహుఁడు, వీరవరుండు, జితేంద్రియుండు, భూ
పాలుని రామచంద్రవిభు వర్ణనఁజేయ విరించి నేర్చునే.

తల్లీ ! వేయేల ! సాముద్రికశాస్త్రవిహితసర్వోత్తమమహారాజ లక్షణాంకితుఁడు.

గీ. సర్వగుణముల నగ్రజుసాటివాఁడు,
భక్తిరూపుఁడు, కోదండపండితుండు,
భగ్నవర్ణుండు, కోపవిభాసితుం, డ
మిత్రదహనుండు, సాధ్వ ! సౌమిత్రి తలఁప.

నేను సుగ్రీవసచివుఁడను, పవమానపుత్రుఁడను, హనుమంతుఁ డను. శ్రీరామప్రియదూతను. తల్లీ ! నాస్వాముల వర్ణించి చెప్పితి. నామాట నింకను విశ్వసింపవేని యిదిగో శ్రీరామ దత్తాంగుళీయకము (పాదములకడ నుంచి సాష్టాంగనమస్కార మొనరించును)

జానకి:- (పరమసంతోషమున గ్రహించి కనుల కద్దుకొని)

గీ. రాముకరపల్లవము ననారతము సుంత
బాయకుండెడిముద్రికా ! భవ్య వీవె
నీమజీవిక గర్వింపఁగాదె ? నాకు
రాముమాఱుగ నినుఁగనఁ బ్రాణ మబ్బె.

హనుమంతా ! రామదూతవని విశ్వసించితిని. సర్వకామదుండును, సర్వేశ్వరుండును, ప్రాణకాంతుఁడును, నగురఘువల్లభుని బాసి యీపదినెలలనుండి నేఁబడినపాట్లు, అనుభవించినదుఃఖము వర్ణనాతీతముకదా ? ఇప్పుడు రావణుఁడు నన్ను దుర్భాషలాడఁ జెవులార వింటివికదా ? నారాముఁడు నన్నిటు లసహాయ నొనర్చి మిన్నకుండుట భావ్యమా ? నన్నెన్నఁడైన స్మరించునే ? నా కేమని చెప్పిపుచ్చెనే ? శీతలపవమానాంకురసమానసుఖదంబు లగునాప్రాణకాంతునిసందేశముల శోషితదేహలతిక యగునీజానకి కూరటఁగలిగింపుము.

హను:- తల్లీ ! అస్మత్స్వామి యగురామచంద్రమూర్తిసందేశ మెఱిఁగించుచున్నవాఁడ. అవధారు.

సీ. శశిముఖి! సీత ! నాసరసు నీ వుండమి నిశలు పవల్లయి నెగడె ననుమి
దరహాసవదన ! సీతా ! నీవు దరిలేమి చిఱునవ్వు పూర్తిగా మఱచి తనుమి
గజగమన ! సీత ! నికటమున నీలేమి హరిణయానంబు నా కబ్బె ననుమి
చక్రవాకస్తని ! జానకి ! కనమిని భానుండు శశియయి పరఁగె ననుమి

గీ. వర్షఋతువెల్ల కురిసినవారి యెల్ల భానుజకరప్రసారణఁ బాయు ననుమి
దేహమునుఁబాసి దేహి చింతించుతరము చెప్పుట కసాధ్య మనుచు వచింపు
[హనుమ !

గీ. నీవియోగాన నిర్నిద్రి నెగడువాడు
తాప మీరామముద్రిక తప్పకుండ
సత్యముంజేసి చెప్పు నుష్ణమితిరీతి
దీనిఁ గని సుంత యూరటఁబూను మనుచు.

గీ. కర్మ మవిలంఘనీయమై కాల్చెలు ననుమి
పాపఫలమె మున్నుం దనుభావ్య మయ్యె
ననుమి, సుఖకాల మాసన్నమయ్యె ననుమి
వచ్చె రాముండు వగవఁగవలవ దనుమి.

ఏమనిచెప్పుదును మాశ్రీరామజనకునిదుస్థితి.

చ. అనుజుఁడు ధైర్యమూను మనునప్పుడుదక్క నినుం దలంచి యో
జనని ! తదేకదృష్టిఁ గని 'జానకి ! మైథిలి ! సీత ! భూసుతా !'
యని పలవించి శూన్యతలమంత కవుంగిటఁ జేర్చి బాష్పముల్
కనుగవ నించు నీవిభువిలాపమ దిట్టిదనంగ శక్యమే ?

అమ్మా ! నాపుణ్యవశంబున మిమ్ములఁ బొడగంటిని. నీవియో గంబున నందురు నీప్రాణకాంతుని నీశుభోదంతశ్రవణమున సం తోషితస్వాంతుఁ జేయ సత్వర మేగవలయు. నేను గిష్కింధఁ జేరిన తత్క్షణమే సర్వకపిసేనలతో నీవిభుఁడు విచ్చేసి రావణు సబాంధవ ముగ ఘోరసంగ్రామరంగంబునఁ గూల్చి నిన్నుఁ జేకొని పోవఁ గలఁడు. ధైర్యము వహింపుము.

జాన:- ఆంజనేయా ! శతయోజనవిస్తారంబగు నీసాగరోల్లంఘనము నీరూపంబునకు సాధ్యమాయని శంక వొడమెడి.

హను:- తల్లీ ! ఇదియా నీసందియము ? ఈరామదూత సామాన్య ప్లవంగుఁడని తలఁపఁబోకుము. ఇదిగో నారూప మవలోకింపుఁడు.
(అని కాయమును బెంచును.)

జానకి:- (వీక్షించి కనులు మూసికొని) అబ్బా ! అబ్బా ! భయాన కము. భయానకము. ఈసిద్ధపురుషున కేది యశక్యము ?

క. తారలు తలపూవులుగా,
నీరదములు పాదయుగళినికటపుపొదలై
మీరఁగ, భయావహంబగు
నీరూపముఁగాంచి నెవరు నేర్తురు ? హనుమా !

ఆంజనేయా! శ్రీరామదూతా! భయానకంబగు నీవిశ్వరూప ముపసంహరింపుము.

హను:- మాతా! చిత్తము. (హ్రస్వరూపుఁ డగును.)

జాన:- ఆంజనేయా! వింటివికదా రావణునిమాటలు! నాప్రాణావధి యిఁక రెండుమాసములు మాత్రమే. కావున నొకమాసము లోపుగా శ్రీరామసందర్శనము నాకుఁ జేయింపుము.

హను:- తల్లీ! నీకంత చింతయేల? ఈకుమారుని వీపున నధివసింపుము. కనుమూసి తెఱచులోపల మాజనకుని పాదపద్మసామీప్యమున నిన్నుంచెద.

జాన:- కుమారా! పావనీ! నీవెంతకేని సమర్థుఁడవని నీవిశ్వరూపమే నుడివినది. అయినఁ గొన్ని యభ్యంతరములు కలవు. నీవు వాయువేగంబున గగనంబున నేఁగుతఱి యాజవంబునకుఁ బరిభ్రమించి నేను సాగరంబునఁ బడిపోవవచ్చును. నీవు నన్నుఁదీసికొని పోవుటలోఁ గొందఱు రాక్షసులతోఁ బోరవలసివచ్చును. ఇది యెన్ని కీడులకేని యాస్పదము. అది యట్లుండ నాప్రాణకాంతునిఁ దక్కయన్యుల స్పృశింపనొల్ల. మూర్ఛాపరవశనై యుండ రావణుఁడు రథంబున నిడుకొని తెచ్చెనేకాని వేఱుకాదు. దొంగవలె రావణుఁడు ననుఁగొని తెచ్చిన నసహాయశూరుఁడగు శ్రీరాముఁడుకూడ జానకిని దస్కరించికొని పోయె ననువాదు తప్పదు. అట్లేల? శ్రీరామ కోదండ పాండితీ ప్రదర్శనానంతరము రావణ మరణానంతరమే రఘువీరుని వెంబడించెద.

హను:- తల్లీ! చిత్తము. అట్లయిన నా కేదోయభిజ్ఞాన మొసఁగింపుఁడు.

జాన:- హనుమా! చిత్రకూటంబున మే ముండినతఱి జరిగినమణిశిలాతిలకగాథ స్మరింపు మనుము. ద్రోహియా కాకాసురునిపై విడిచినబ్రహ్మాస్త్రము రావణునిమీఁది కేలపంపకుంటిరని యంటినని జ్ఞాపకము చేయుము.

హను:- తల్లీ! సరియే. తదుపరి మాజానకి యేమిచెప్పినదని శ్రీరామచంద్రుఁ డడిగిన నేమినుడువుదు.

జాన:- హనుమా! నే పడుచున్న యవస్థయు నాయిప్పటిగతియుఁ గను లారఁగాంచితివిగాన నున్నదున్నట్లయ్యా రఘునితోఁ దెలుపుము. నేను విశేషము చెప్పలేనుగావున నారంభాపత్రి మిటు తెమ్ము. ఈకాటుకకన్నీట నాగతి నాప్రాణకాంతునకు వ్రాసిపుచ్చెద.

హను:- మహాప్రసాదము. (నిష్క్రమించి అరటియాకుతోఁ బ్రవేశించి) తల్లీ! ఇదిగో (అని పాదములచెంత నుంచును)

జాన:- (అరటియాకుఁదీసి కాటుకనీటిలో పుల్ల ముంచి వ్రాయుచుండును)

హను:- (స్వగతము) ఆహా! ఎట్టివారైన విధిఁ దరింపలేరుకదా? (అని తలపంకించుచుఁ జేతులఁగట్టుకొని నిలువఁబడి యుండును)

జాన:- (ముగించి) హనుమా! ఇదిగో జాగ్రత్త. (అని రంభాపత్రము నందిచ్చును.)

హను:- మహాప్రసాదము.

జాన:- ఈచూడామణిని నాయానవాలుగా నాప్రాణకాంతున కొసంగి యాతని సత్వరమ ససైన్యముగ నెత్తివచ్చునట్లుచేసి విరహాముగ్నుల మగుమమ్ము పునస్సమాగమసంతోషితస్వాంతుల నొనరించుటలో నీవు పురషకారి వగుదువుగాక. నీయొనర్చినయుపకృతికి మాఱు సల్ప నశక్తను గావున బ్రహ్మకల్పాంతము దీర్ఘాయుష్మంతుఁడవై మనఁజేయ నానాథుననుగ్రహము నభ్యర్థింతు.

హను:- (నమస్కరించి లేచి) తల్లీ! ఈమాసములోఁ దప్పక నీప్రాణకాంతుని ససైన్యముగఁ గొనివచ్చి నీబంధవిముక్తిఁ గూర్చెద. ఇఁక నేఁబోవ సెలవిండు.

జాన:- హనుమా! శుభంబున నేగి రమ్ము. శ్రీరామసౌమిత్రులను సుగ్రీవాదిసమస్తకపిశ్రేష్ఠులను క్షేమ మడిగితినని వచింపుము.

హను:- మహాప్రసాదము. (మఱలి కొంతవడి పరిక్రమించి స్వగతము) ఇప్పటికి జానకీమాత దర్శనకార్యము నెఱవేఱినది. కార్యభంగము కాకుండ నొకటిచెప్పిన రెంటిని జేసివచ్చువాఁడు దూతలలో నుత్తమ

భూతమై రాజనుతిపాత్రుఁ డగును. అధర్మమార్గచరు లగుదానవుల యెట్ల చతుర్థోపాయం బగుదండనీతియే కార్యకారి. నాపరాక్రమ లేశప్రదర్శనముచే లంకాపురమున గగ్గోలొదఁగూర్చి రావణు భయకంపితు నొనరించి శ్రీరామదూతశౌర్యప్రకటనమొనర్చియే మఱలెద. శ్రీకోదండరామచంద్రమహాప్రభువునకు జై. (దుముకి నిష్క్రమించును)

(తెరలో)

సింహనాదములు, ప్రాసాదపతనశబ్ద మగును.

శా. ప్రాసాదంబుల నేలఁగూల్చి, వనము ల్ధ్వంసంబుఁగావించి సం
త్రాసావిష్టుల రాక్షసావళుల క్రమందం జేయుకీశాధముఁ
గాసింబెట్టఁగ మేఘనాథుఁడు మహోగ్రం బైనబ్రహ్మాస్త్రముఁ
వేసెం దచ్ఛరబంధము ల్కపిని నిర్వీర్యుం బొనర్చెంగదా!

4. స్థలకము - లంకాపురము; రావణునిసభ.

[రావణప్రహస్తవిభీషణు లుచితాసనాసీనులై యుందురు]

రావ:- అక్కటా ! యోధాగ్రేసరులారా ! మంత్రివరులారా ! మీ కీయకాలమృత్యు వెచ్చోట దాఁపరించె ? అక్షయకుమారా ! నీయ నుపమానశౌర్య మీమర్కటాధమునిపట్ల వమ్మయి క్రమగ్గితివా ? సచివా ! ప్రహస్తా ! లంకనెల్ల విధ్వంసమొనరించుచున్నయాకోఁతి యింకను జిక్కలేదా ? ఇంద్రజిత్తు యుద్ధమొనర్పఁబోయెనే ! వానికి నసాధ్యమై యుండునా ?

ప్రహ:- రాక్షసచక్రవర్తీ ! ఇంద్రజిత్తు చేతిలో నీకోఁతి యెంత ? తప్పక పట్టి తెచ్చును.

(తెరలో)

కీశాధమా ! ఈతూరి తప్పించుకొని యెచటికిఁబోయెదవురే ? భటులారా ! ఈవానరుని మాతండ్రిగారి కప్పగింపుఁడు. నే నిప్పుడే వచ్చెదను.

ప్రహ:- మహాప్రభూ! వింటిరా మేఘనాదుని మేఘగంభీరనిస్వనము! ఆకోఁతిని బట్టి బంధించి మనయాస్థానమునకుఁ బంపుచున్నాఁడు.

రావ:- ఎట్లయిన సమర్థుఁడు. రాని మ్మామర్కటునిపీచ మడఁచి పంపుదము.

(బంధితుఁ డగుహనుమంతుఁడును నిరువురు రాక్షసులు ప్రవేశింతురు.)

హను:- (స్వగతము) ఈవెఱ్ఱిమొగములు వారికి నేఁజిక్కితినని వికవికలు పకపకలాడుచున్నారు. ఆచతురాననునియందలిగౌరవము పేర్మిని తద్వరానుసారముగ నీబ్రహ్మాస్త్రంబునఁ జిక్కితిని. అన్య బంధనంబుల బాధితుఁడ నైనాట నీయస్త్రబంధంబులు వాసినవి. ఇట్లు చిక్కుటచేతనే రావణదర్శన మైనది. ఇఁక నీనెపంబున రావణునకు హితోపదేశ మొనర్చి తరువాత నే మఱలుయత్నము సలిపెద.

1 రాక్ష:- రావేం. రాక్షసచక్రవర్తిదర్శనం చేసుకో! (అని లాగును)

2 రాక్ష:- నీపని పట్టించెదను లే.

హను:- వచ్చితిఁగదా యింకేమి ?

రావ:- (స్వగతము) మహోగ్రమూర్తి అనంతబలసమన్వితుఁడుగాఁ దోఁచుచున్నాఁడు. కైలాసగిరిఁ బెకలించుతఱి శపించిననంది యగునా ? లేక బాణుఁ డీయాకృతిని వచ్చెనా ? ఏమీ యాతని గాంభీర్యము ? రక్షోలోకచక్రవర్తి నగునన్నుఁగూడ సరకుసేయు నట్లు కాన్పింపఁడు. ఈతనివృత్తాంత మారయ వలయును. (కోపమునఁ బ్రహస్తునిదిక్కై) సచివాగ్రణీ ! ప్రహస్తా! ఈకీశాధముం డెవ్వఁడో ? ఏమికార్యార్థమై లంకఁ జొచ్చెనో ? ఎవ్వఁ డంపవచ్చెనో? కావలివాండ్ర తర్జించి వనధ్వంసమొనర్చి యుద్ధ మేటికి సలిపెనో కనుఁగొమ్ము.

ప్రహ:- ప్రభునాజ్ఞానుసారమే. (హనుమంతుదిక్కై) ఓమర్కటుఁడా ! భయ ముడుగుము. నీవు హరిదూతవా? అష్టదిక్పాలకానుచరుఁడవా చెప్పుము. నిక్కపువానరుఁడవైన నీతేజోబలంబు లరుదు. నిన్నెవ్వ రంపిరో నిజేము చెప్పిన విడిచిపుచ్చుదుము. అసత్యప్రలాపివైన భుజములపైఁ దల నిలువదని నమ్ముము.

హను:- దనుజేంద్రా! నే నష్టదిక్పతులభటుఁడఁ గాను. హరిబంటును గాను. నేను నిక్కపువానరుఁడనే. నిన్ను దర్శింపఁగోరి యది యసాధ్యమని తలఁచి వనోన్మూలన మొనర్చితి. నిజరక్షణార్థమై నన్నెదిర్చినవారితో యుద్ధమొనర్చి వారిని సమయించితి. నే నైంద్రాద్యస్త్రముల కసాధ్యుఁడ. బ్రహ్మయెడఁ గలగౌరవంబున వరానుసరణంబుగ నాయస్త్రముచేఁబట్టువడితిని. అన్యబంధనంబులచే నవి గూడఁ బాసె. నేను గొండొకకార్యార్థమై వచ్చినశ్రీరామదూతను. శ్రీరామచంద్రునియనుపమానబలంబున వాలివధానంతరము వానరరాజ్యపట్టభద్రుఁ డగుసుగ్రీవుఁడు నీకుఁ జెప్పుమనిననుడువుల వినుము.

సీ. నినుఁ జంక నిఱికించుకొని నాల్గుసంద్రము ల్వ్రాలిచినవాలిని నుఱుగఁజేసి
దండకాటవి జనస్థానవాసులఁ బదునాల్గువే లసురుల నీల్గఁజేసి
బలవంతులైనకబంధవిరాధుల నంతకాలయమున కరుగఁజేసి
సీతాపహర్తకై చిచ్చఱకంటితో సజ్యకోదండాసనశరముఁజేసి

గీ. భృకుటికుంచితుఁడై దుర్నిరీక్ష్యుఁడైన రామబాణానలంబున మ్రగ్గకుండ
జానకినిఁ దెచ్చి శ్రీరామచంద్రపాదనికటమునునుంచి సుఖియింపనేర్వు మనియె.

జనకాత్మజాపాతివ్రత్యానలంబునను శ్రీరామక్రోధాగ్నిజ్వాలలను భస్మీభూతాయుష్కుండ వగునీ కమృతోపమానం బగు నావినుచుహితము వినుము.

చ. కడిఁదితపంబుచేఁ గనకగర్భునిమెప్పు వహించి యాయువుం
బెడిదపుతేజము న్గొనినవీరుఁడ వన్యసతీరతుండవై
జడుగతి మ్రింద నేమిటికి? సత్పథవర్తనచేఁ బ్రతిష్ఠ చే
పడుఁగద? సౌఖ్యఫక్కి మన వాంఛిల, వేతొలిబాముదోసమో?

రావ:- (మహోగ్రుఁడై) మే ముపేక్షసేయుకొలఁది నోటి కొదవినట్లు వాగుచున్నావు. మూయింపవలయునా నోరు? నీవేదపన్నంబు లిఁకఁగట్టిపెట్టుము. నా కిట్టికొఱగానివాక్యంబు లుపదేశించుటకా దర్శనమొనర్చినది? ఇఁక నిన్ను సైరింపఁదగదు. సైరింపఁజాలను.

(ప్రహస్తునిదిక్కై) సచివాగ్రణీ! ఈకీశాధమునివదరుఁబోతుతనమునకు ఫలము గుడిపింప నీతనిఁబట్టి వధింపుము.

విభీ:- అగ్రజా! రాక్షసరాజ్యరమాధురంధరా? ధర్మపథవర్తులుగదా ప్రభువులు? దూతవధ నింద్యకార్యము. అందుఁ గీశహననము మఱింతనింద్యము. సర్వధర్మవిదుండ వగునీకుఁ జెప్పవలసినది లేదు గాన నీతని కేదో యుచితదండనము విధించుట సమంజసముకాని వధించు టధర్మము. ఈకోఁతిని జంపిన నేమిలాభము? వీని నంపిన వాని శిక్షింపవలయుఁగాని వీని దేమిలెక్క? వీనిని జంపినయెడల సముద్రలంఘన మొనర్పఁగలవాఁ డింకొకఁడు లేకుంటచేత నేమి వేఱొక కారణముచేత నేమి యుద్ధము నిలిచిపోవచ్చును. దాన శత్రుమారణము తటస్థింపదు. యుద్ధోత్కంఠుఁడవౌనీకార్యము చెడుఁగదా? కాన వీనిని శిరోముండనాదిపరిభావ మొనర్పించియో లేకయేదేని దేహపీడఁ గల్గించియో విడిచిపుచ్చుటే యుక్తము.

రావ:- ధర్మవాక్యభూషణా! విభీషణా! నీవాక్యంబు లెంతయు సమంజసములు. ప్రహస్తా! దూత యవధ్యుఁడు. కపులకు లాంగూలము భూషణప్రాయమగుట దానిని గాల్చిపంపిన నీతఁడు తమవారిఁజేర నచ్చుట నెల్లరకుఁ బరిహాసపాత్రుఁ డగును. అదియే మనకుఁ గావలసినది. అట్లు చేయింపుము. నేటికి సభ చాలింతము.

ప్రహ:- చిత్తము. ప్రభునాజ్ఞానుసారమే. భటులారా! ఈకోఁతి తోఁకకు గుడ్డలఁజుట్టి చమురున ముంచి యగ్నిహోత్రప్రీతి యొనర్చుచు నీతనిచరిత్రముఁజాటుచు వాడవాడలఁ ద్రిప్పి వద లుఁడు.

1రాక్ష, 2రాక్ష:- సిత్తం. బాబూ. పదా కోఁతీ. పద. నీపంథా పడ తాం పా.

హను:- కానిండు, చూచెద. (యవనిక జాఱును)

(తెరలో మంటలు; ఆర్తధ్వనులు వినఁబడును.)

గీ. లంక నెల్లెడఁ దనదువాలగతవహ్ని
కచ్చిక లొనర్చి, సీతమ్మఁ గాంచి, రభస
మున నరిష్టాద్రిపైనుండి చనెడి నుత్త
రాభిముఖుఁడయి వాయువేగాప్తి హనుమ.



శ్రీ

# శ్రీరామోద్యోగము

## పంచమాంకము.

### 1. స్థలకము - మధువనద్వారము.

దధిముఖుఁడు:- (శోకవిహ్వలుఁడై ప్రవేశించి వగచుచు) అయ్యో ! అయ్యో ! అంగదుఁడు యువరాజు కదాయని వనములోనికి వదలిపెట్టిన నీహనుమజ్జాంబవంతులకుఁ దోడై విచ్చలవిడి మధుపాన మొదలయి తెరఁగదా ? ఇంత భయములేక యిట్టియాజ్ఞ నొసఁగనేమికారణము ? మధుపానమత్తులై నే నెంతవలదని చెప్పుచుండినను ద్రాగినంత త్రాగి కాయలను బండ్లను విచ్చలవిడి రాల్చి వనమంతయు దుంపఁదెంచి కిలకిలారావములతోడను, గుఱుగురు శబ్దములతోడను, వెక్కిఱింతలతోడను దండనాలఁద్రొక్కుచు హెచ్చరికల సరకుసేయక నే గట్టిగ మందలింప నాపైఁ బునఃదాషామరపాలతోడను నఖక్షతదంతక్షతములతోడను, నర్ధచంద్రప్రయోగములతోడను బాధించిరి. వాలికాలమునుండి చీమ చిటుక్కుమనకుండఁ గాచినయీమధువనము నీపఁగాచి నక్కలపాలొనరించినట్లు వీరికి నేటి కప్పగించవలసివచ్చెను. అబ్బో ! అబ్బో ! నాయొడలిలో విఱిఁగినయెముకయే కాని విఱుఁగనియెముక లేదు. నాయనా ! బాబో ! (ఒడలు పిసికికొనుచుఁ గంటినీరు తుడుచుకొనుచు బాధ నభినయించుచు) యీసంగతియెల్ల సుగ్రీవ మహారాజుగారికి మనవిఁజేసికొని వీరలభరతము పట్టించి నాకసినేవిధమున నేన్ని దీర్చుకొనయత్నించెదను.

(నిష్క్రమించును)

## 2. స్థలకము — ప్రస్రవణగిరి ప్రాంతభూమి.

(శ్రీరామలక్ష్మణ సుగ్రీవు లాసీనులై యుందురు)

శ్రీరా:- సుగ్రీవా! పూర్వాపరోదగ్దిశల కేగినవానరవీరులు సీతజాడ కానరాలేదని తిరిగివచ్చిరిగాని యామ్యదిశ కేగిన పవనజాంగదాదులు మాత్రము రాకుండిరికదా? ఎంతకాల మిట్లు జానకీవియోగము సైరింపనేర్తు? ఈపదిమాసములు పదిమహాయుగములుగ నున్నవికదా? ఏమొనర్తును?

సుగ్రీ:- శ్రీరామచంద్రా! అసామాన్యప్రతిభావంతుండును గార్యసాధకుండునగు హనుమంతుఁ డతిశ్రద్ధతో వెదకుచుండుటంబట్టియే యింతజాగయ్యెనని తోఁచెడిని. జానకీదేవి వార్తఁ గొనిగాని యాపావని వచ్చునట్లు తోఁచుటలేదు.

(తెరలో)

అమ్మో! బాబో! మీకొలువు లేకుండినఁ జోనింపఁగాని యీచాపుదెబ్బలను నేను తినఁ లేను బాబూ! ఊ ఊ ఊ (అనియేడ్పు వినవచ్చును)

సుగ్రీ:- ఎవరురా అక్కడ?

దధి:- (కిన్నటితోఁ బ్రవేశించి) మహారాజా! చూడండి నావాళ్ళ పడ్డపాటు. ఈగోకిళ్ళు యీపీకిళ్ళు ఆకాలితన్నులు బాబూ ఏమి సెప్పను? ఏయేటఁబడమన్నారు మహాప్రభూ!

సుగ్రీ:- దధిముఖా! చాలకాలమునుండి మాకొలువున నున్నాఁడవు. ఎన్నఁడిట్లు విసుగుకొని యెఱుఁగవు. ఎవరు నిన్నిట్లుచేసిన దుర్మదాంధులు?

దధి:- ఎవరో కాదు బాబూ! అంగదయ్యా, అనుమంతయ్యా, జాంబవంతయ్యా, అంతా మనవాండ్లే బాబూ! పరాయివాండ్లు కారు బాబూ! మధువన మంతా ధంసంచేసి తేనె తాగినంత తాగి నేలకపోసినంత నేలకపోసి యెంచెప్పను అల్లకొల్లారం చేస్తూ వద్దంటే

నా కీశా స్తిచేసినారు బాబూ ! అంతట ఆదెబ్బలకు తట్టుకోలేక మీపాదాలకాడికి పరిగెత్తొచ్చా.

సుగ్రీ:- దధిముఖా ! వారల నే దగినవిధంబున మందలించెదలెమ్ము. దుఃఖము మాని సత్వరమ రమ్మని సుగ్రీవాజ్ఞగా నంగదహనుమ దాదులతోఁ జెప్పి తత్క్షణ మిచ్చటికిఁ బంపుము. నీ కేమియు భయము లేదు. పొమ్ము.

దధి:- చిత్తం. మహాప్రభూ ! ఇక్కడున్నట్లు పంపిస్తా.

(నిష్క్రమించును)

సుగ్రీ:- శ్రీరామచంద్రా ! జానకీశుభోదంతవహుఁ డగుమారుతిం గన సిద్ధపడుఁడు. అట్లుకాదేని గడువుమీఱి రిక్తహస్తముల వచ్చువారు నిర్భయవృత్తి మధువనమువైపుఁ దేఱియైనఁజూడ సాహసింపరు. ఇది సంతోషాతిశయమున శ్రమవాయఁజేసినపనికాని వేఱుకాదు.

(తెరలో కపిశబ్దములు)

(హనుమదంగదజాంబవంతులు ప్రవేశించి శ్రీరామలక్ష్మణ సుగ్రీవులకు సాష్టాంగదండప్రణామ మొనరించి యంగదజాంబవంతులు లేతురు)

హను:- (మెల్లగా లేచుచు)

కం. కంటిని జానకి, రఘువర !
తుంటరి రావణుఁడు పలుకుదురితోక్తుల నే
వింటి, నలలంకఁ గాల్చియుఁ
గంటిని మీపాదయుగళిఁ గమలదళాక్షా !

శ్రీరా:- (మహాసంతోషముతోఁ గవుంగిలించుకొని) పావనీ ! నీవంటి పుణ్యశాలి యొందేనిఁగలఁడే ? నాప్రాణపదం బగుజానకీశుభోదంతం బెఱింగించి నాప్రాణముల నిల్పితివి. నీ కేమిప్రత్యుపకార మొనర్పఁగలను ?

హను:- మహాప్రభూ ! తనుకింకరుఁ డాజ్ఞార్థుఁడేకాని ప్రశంసార్హుఁడా? మాతల్లి యీచూడామణిని దమకు సమర్పింపుమని యొసంగె. (భయభక్తులతో శ్రీరామునిపాదములచెంత నుంచును)

శ్రీరా:- సుగ్రీవా ! ఈచూడామణినిఁ జూచితివా ? మామామగా రగుజనకమహారాజుగారికి క్రతుతృప్తుఁ డగుదేవేంద్రుఁ డొసంగి నది. అదియే మావివాహకాలమున నాయఁఘునిచే జానకీశిరం బున నుంపఁబడినది.

గీ. పరమసంతోషసమయాన వసుధజాశి
రంబునను జేరి, దుఃఖకాలంబునందు
నైనఁ బాయనినినుఁ గాంచే మానసమున
నిను ధరించెడిసీతఁ గాంచినట్లు తోచె.

సౌమిత్రీ ! చూచితివా మీావదినె చూడామణిని ?

లక్ష్మ:- అగ్రజా ! కాంచితిని. ఈచూడామణి తన్ను ధరించిన మాజ నని సారూప్యముఁ గొంతవహించినదని చెప్పకయె చెప్పెడిని.

శ్రీరా:- తమ్ముఁడా ! నిజేము నిజేము. ఇది జడమయ్యును జానకీస్థితి వేనోళ్ళఁ జాటుచున్నది. పావనీ ! నీగమనాగమనవృత్తాంతంబు, నమృతోపమానంబు లగుమాజానకీవాక్యంబులఁ గర్ణరసాయన మొనరింపుము.

హను:- స్వామీ ! యేమనిచెప్పుదును ? దక్షిణాపథమ్ము బంతయు వెదకుచుఁబోయి విశ్వకర్మనిర్మితం బగు ఋక్షబిలంబునఁ జిక్కి-తోవఁగానక స్వయంప్రభానుగ్రహంబున సముద్రతీరముఁజేరి జటాయునగ్రజుం డగుసంపాతిచే సీతామాతవృత్తాంతే మెఱిఁగి సముద్రతరణం బొనరించుచు దేవప్రయుక్త యగు నాగాంగన సురస నతిక్రమించి, ఛాయాగ్రహ మగుసంహికోదరముఁ జొచ్చి వెలువడుట వధించి లంకాధిదేవతను దునిమి, లంకయెల్లెడఁ గలయ వెదకి యెచ్చటను గానక దుర్గద్వార మెక్కి- యొక్క-యశోక వనముం గని యం దుండునేమో యనుభ్రమ నచ్చటి కేగి వెద కఁగ నొకశింశుపావృక్షముక్రింద మలినాంగియై, యేకవస్త్రయై, యేకవేణియై నివురుగప్పిననిప్పువలె రాక్షసీశార్దూలములమధ్య నున్నజానకీకురంగాక్షిఁ గంటి. ఏమందు రఘువీరా ! ఆయవస్థితి? కారెడు కన్నీరు కాల్వలైపార, శ్రీరామరామరామేతిమంత్రజపం

బున నిశ్చంచలమై రాక్షసీతర్జనభర్జనంబుల నావంతయు లెక్క-
సేయక దేవర పాదపంకజైకధ్యానయై దినముల వత్సరములట్లు
గడపుచున్నది. ఇంతలో రావణుఁడు వచ్చి తన్ను వరింపుమని
యే మేమో ప్రేల బాలతృణమును గేలఁ బూని చీడపురుగును
విదలించునట్టుల విదలించివైచుచు నాతనికి హితోపదేశ మొన
రించె. అతఁ డాసాధ్వి తనబుద్ధి మార్చుకొని తన్ను వరించుటకు
రెండుమాసములు వ్యవధియొసంగి యంతలో మార్చుకొననియెడల
నామెపలల మాహరింపుఁడని యచ్చటిరక్కసుల కానతిచ్చి
వెడలిపోయెను. నే నిది యంతయుఁ గనుఁగొంచి చెట్టులారవిని
యాతఁడు పోయినపిదప సమయ మెఱింగి యాతల్లి యెదుటఁబడి
మీసేమము విన్నవించి మీయంగుళీయక మొసంగ నాసాధ్వి
నన్నుఁ దమదూతగా నమ్మి తనస్థితియంతయు నేఁజూచినట్లు తమకు
నివేదింపుమని చెప్పుచు సుగ్రీవాదికపివర్యుల నందఱ నడిగెను.
తనమనవి నీరంధ్రాపత్రముపైఁ గాటుకకన్నీట వ్రాసి పుత్తెంచె.
ఇదిగో స్వీకరింపుఁడు (పాదములచెంతఁ బెట్టి భయభక్తితో నమ
స్కరించి నిలుచుండును.)

శ్రీరా:- పావనీ! శుభోదంతవహుండ వగునీవే యాలేఖఁ జదువుము.

హను:- చిత్తము. అవధారు.

శ్రీరా:- మారుతీ! కానిమ్ము.

హను:- చ. అనుపమశౌర్య మచ్చునడ నర్థశరీరముఁ గాకి వ్రేచఁగాఁ
బనుపవా కో యజాస్త్రమును ? పాపిఁదమ్ము న్నికురించి నన్నుఁదె
చ్చినదనుజాధము న్ననుమఁ జేయ వదేటికి వాడితూపుచే
ననదనొకో సనాథనయి ? అర్కకులాధిప ! వేగఁ బ్రోవుమీ.

శ్రీరా:- అయ్యో! జానకీ! నీజోడ యెఱుంగమియేకదా దీనికిఁ గార
ణము! సైరింపుము. పావనీ! తరువాత.

హనుమం:-

సీ. కనుఁగవఁబడినది కాంచనం బనుచును కంటికెదురుగానె నిక్కం బటంచు
సత్యం బసత్యంబు సరణిని, దబ్బర నిజమని మదిలోన నిలిపి తనుచు

పురుషసమ్మోహనమూర్తులౌ తమకంటెఁగాంచనమృగమె యాకాంక్ష్యమనుచు
జననీరీతిని నన్నుఁ గనెడిపుణ్యాత్ముఁడు సౌమిత్రి భ్రాతృవంచకుఁ డటంచుఁ

గీ. దలఁపఁ గర్మేంద్రియములఁ, జిత్తభ్రమణము, వన్యచింతన, భాగవతాపరాధ
మునను జిక్కిన, శరణార్థి, నగుచు వేడ నన్నుపేక్షింపఁ దమకు ఘనంబె? నాథ!

శ్రీరా:- (స్వగతము) ఘనము కాదు. ఇప్పటి కీచెలువ యొనర్చిన యపరాధములకు సంపూర్ణపశ్చాత్తాపత ప్తయైనది. (ప్రకాశముగ) ఆంజనేయా! తరువాత.

హను:- గీ. తండ్రివలె మిమ్ములను, గన్నతల్లికంటె
మిన్నగను నన్నుఁ గాంచుసౌమిత్రి నాఁడు
తిట్టుపాపఫలం బెల్లఁ గట్టి కుడిచి
తింకనైనను దరిఁజేర్పవే మహాత్మ!

లక్ష్మ:- (కన్నీటితో) పాపము. పిచ్చితల్లి! ఇది రాక్షసమాయ యమ్మా! మాయగ్రజున కేమాత్రము భయములేదని నే నెంత నుడివినను స్త్రీనైజమున నన్నుఁ గరకులాడి పంపినది. కాకుండిన నిట్టిదురవస్థ తనకుఁ బట్టదుకదా? కానిమ్ము. (మహాకోపమున) అనలంబుఁ గొంగున ముడిచినట్లును, ఘోరభుజంగమును ముద్దిడికొనినట్లునని రఘువీరులశౌర్యము నాపిరికిపంద, యాఘ్రుచ్చు తిలకించుఁగాక.

శ్రీరా:- హనుమా! తరువాత.

హను:- స్వామీ! తుద కిట్లు నుడివె.

గీ. పతితపావన! శ్రీరామ! భవ్యనామ!
వైరిని వధించి నన్గావ భావ్యమయ్య
యొక్కమాసంబె యసువులఁ జిక్కఁబట్టఁ
గలను; బై నింక మనుటెల్లఁ గల్ల కల్ల.

శ్రీరా:- హనుమా! చాలును చాలును. ఇఁక విన఼జాల. అణుమాత్ర మాలసింపఁదగదు.

ఉ. ఉత్తరఫల్గునీయుతముహూర్త మహీనశుభాస్పదంబు నేఁ
డుత్తమ మాజికై కదఁగ నుద్యదహస్కరుఁ గాంచు మొంతశో
భోత్తరుఁడై కనంబడెడినో ! తరుణంబు కపివ్రజంబుతో
నత్తిచనంగ రావణు నహీనపరాక్రమవృత్తిఁ దాకఁగన్.

క. పరమపతివ్రత జానకి
నిరంతరము గార్చు బాష్పనీరక్షతమై
సురిగెడి దానవసతికిం
ధరసూత్రము సీతతోడఁ దాఁ గను ముక్తిన్.

జాం:- తథాస్తు. తథాస్తు.

సుగ్రీ:- మహాప్రభు చిత్తము. అంగదహనుమజ్జాంబవాతులారా !

ఉ. మండెడిభానుఁ డాగగనమధ్యతలంబున, సన్ముహూర్త మా
దండన గల్గె, రాఘవుఁడు దారుణకోపపరీతచిత్తుఁడై
భండనభూమికై చనఁగ బాణశరాసనపాణి యౌటచే
పొండిఁక నాలుబిడ్డలను బోలఁ గనుంగొని వేగ రండిటన్.

ఇప్పుడే బయలుదేర సంసిద్ధులు గండని సకలకపిభల్లుకసైన్యముల కాజ్ఞ.

అంగ. హను. జాంబ:- చిత్తము. ప్రభునాజ్ఞానుసారమే.

(యవనిక జాఱును)

(తెరలో భేరీభాంకారము.)

గీ. నేల యీనినట్లు నిండినకపిఋక్ష
సైన్యచయము గొలువ సాగరంపు
తటమునను సుమిత్రతనయసంయుతముగ
సీతఁ దలఁచు రామభూతలపతి.

## 3. స్థలకము — సముద్రతీరము.

(శ్రీరామలక్ష్మణు లుపవిష్టులై యుందురు. వెంబడి దర్భశయన ముందును)

శ్రీరా:- అనుజా ! సౌమిత్రీ !

క. లోకంబులోని జనముల
శోకంబు దినక్రమమున సురిగెడిఁగద ? నా
వ్యాకుల మీతరఁగలగతిఁ
గైకొనుచుఁ బ్రవర్ధనంబుఁ గాంచు నిదేమో ?

జానకీవియోగము సైపఁజాల. దుర్భరము. దుర్భరము.

గీ. సాగరం బడ్డమాటచే జానకీ వి
యోగ మబ్బిన నేమను నుర్విపైన
నున్నయదిగదా సీతయం చూరటఁగని
దుఃఖమునఁగూడ సుంత సంతోష మొదవె.

ఈసముద్రుఁ డంతకంత కుప్పొంగుచున్నాఁడుకాని తగ్గి పాయ యిచ్చునట్లు కాన్పించుట లేదు. ఏ మొనర్పనగు ?

[ తెరలో ]

గీ. సాధ్వి భూమిజ నలరామచంద్రుఁ జేర్చి
శరణ మనుమనునావిభీషణుని వెడల
నడఁచుఁగో రావణుండు - ఖిన్నతను రామ
చంద్రుఁ దరిసెడి నావిభీషణుఁడు కినిసి.

శ్రీరా:- సౌమిత్రీ ! వింటివా యీయశరీరవాణిని ?

లక్ష్మ:- అగ్రజా ! ఆలించితిని. ఇట్టిశబ్దముల వినుటనేకదా జానకీ మాత కిట్టిదుస్థితి వచ్చినది. ఇది శత్రుభేదోపాయ మగురాక్షస మాయ యేమో ?

[ తెరలో ]

గీ. హితము విననట్టిరావణు నేది, లంక,
నాలుబిడ్డల, విడివచ్చి యాశ్రితార్తి

హారణు శ్రీరామచంద్రుని శరణ మంటి
భానుజా ! విన్నవింపుము ప్రభునితోడ.

సుగ్రీ:- (పటాక్షేపముతోఁ బ్రవేశించి) రామచంద్రప్రభూ ! రావణునియనుజుఁడు విభీషణుఁడు నలువురుమంత్రులతో వచ్చేసి యాకసమునుండి శరణుశరణనుచుఁ దనసంగతి దేవరకు విన్నవింప వేడుచున్నాఁడు. రాక్షసులు మాయావులు. కనుగలిగి మెలఁగవలయునని నామనవి.

శ్రీరా:- సుగ్రీవా ! వానరసచివులం బిలిపింపుము.

సుగ్రీ:- దేవా ! వారెల్లరయుద్దేశముల నెఱింగితిని. హనుమంతుఁడు తప్ప మఱెవ్వరు విభీషణపరిగ్రహణమున కియ్యకొనుట లేదు.

శ్రీరా:- వానరవర్యా ! తనంత నామైత్రిఁగొనఁదల్చివచ్చినవానిని గాదనుట నామతము కాదు. అందును శరణార్థియై వచ్చెను.

గీ. నేను నీవాఁడనని పల్కి నేని, శరణ
మనుచు నొకపరిఁ బల్కినయంతమాత్ర
నభయమిడి సర్వభూతాళి శుభులఁజేయు
నదియె నావ్రత; మది మీఱనగునె నాకు ?

పక్షియగుకపోతమే తనపొటిని వలనుబట్టి వధింపనున్నబోయనిచలిమాన్ప నగ్నియు సమిధలఁ దెచ్చి యాహారమనఁ దానగ్నిఁజొచ్చి శరణాగతరక్షణపరమధర్మమును లోకమునకుఁ జాటనక్షత్రియుఁడనై శరణనివచ్చిన నీవిభీషణునేకాదు రావణుఁడు వచ్చిన నభయంబొసంగ వెనుదీయుదునని తలంచితిరే ? సుగ్రీవా! నీ వేగి యావిభీషణుని దోడ్కొనిరమ్ము.

సుగ్రీ:- మహాప్రభూ ! ఇప్పటికి నీతఁడా రావణునివేగువాఁ డనియే నానమ్మకము. అతనిఁ జంప ననుజ్ఞయిందుము.

శ్రీరా:- క. శరణన్నవాఁడు తనముం
దర దనుమంగఁబడుచుండ దర్శించినయా

పురుషునిసుకృతము నాతఁడు
పరిగ్రహించు ననుమాట భానుజ! వినవే?

సుగ్రీ:- స్వామీ! ఆతఁడు మనలోఁజేరి కుచ్చెళ్ళలోనిపామువలె దేవరకుఁగాని, సౌమిత్రికేని, నాకేని ద్రోహమొనర్చునేమో?

శ్రీరా:- క. భరతునకు, లక్ష్మణునకు, ద
శరథనృపాలునకు, నీకు సరిపోలెడి సో
దరులును, జనకుఁడు, మిత్రుం
డరయంగా లేరు గాదె? యజ్జహితసుతా!

పరమస్నేహము కూర్చుభయవిహ్వలత నేదుము.

క. అణుమాత్రము కిక్కురుమన
దనుజుని, సురగరుడయక్షతతి నొకతృటిలో
నన కాలుఁ జేర్చు వలకా
ల్గొనగోటను శమను సేవకునిగ నొనర్తున్.

ఆవంతయు శంకింపకుము. తత్క్షణమ పోయి యాతనిఁ బిలిచి కొనిరమ్ము.

(సుగ్రీవుఁడు నిష్క్రమించి విభీషణునితోఁ బ్రవేశించి)

సుగ్రీ:- స్వామీ! తక్కుమంత్రుల నట నిలిపి విభీషణునిమాత్రము తోడ్కొని వచ్చితిని.

విభీ:- గీ. సకలమష్టకుభృద్వ్రజ శరణు శరణు
జానకీహృత్సరోజార్క శరణు శరణు
నిరతశరణాగతత్రాత శరణు శరణు
భీమకార్ముకహస్త శ్రీరామ శరణు.

ప్రత్యర్థితమ్ముఁడనని యావంతయు శంకింపవలదు. నాయావచ్ఛక్తి వినియోగించి రావణవధోద్యమంబున దేవరకు సాయ మొనర్తు.

శ్రీరా:- (చేయి పైకెత్తి)

గీ. అభయ మిడినాఁడ దనుజకులాబ్ధిసోమ !
దాశరథిచతుష్కంబు సత్యం బొనర్పఁ
జేరినా వర్కజునిజేంట శూరవరులు
భరతశత్రుఘ్ను లిట లేని కొరత దీఱ.

విభీషణా ! సాధుపథవర్తివియు సత్యశీలుఁడవు గమ్మ. ఇదిగో లంకారాజ్యపట్టభద్రు నొనర్చుచున్నాఁడ. సౌమిత్రీ ! ఈకపికదంబము నెదుట సాగరజలంబుల నీతని లంకారాజ్యపట్టభద్రు నొనర్పుము.

లక్ష్మ:- చిత్తము. (అనిపోయి సాగరజలమున నభిషేకముచేయును)

విభీ:- ధన్యోస్మి. అనుగృహీతోస్మి.

శ్రీరా:- భావిలంకేశ్వరా ! విభీషణా ! రావణుబలపరాక్రమంబులను లంకాసాధనోపాయ మెఱింగింపుము.

విభీ:- మహాప్రభూ ! చిత్తము. విన్నవించెద. దీన గడచి దీర్ఘాయువు, పెన్న గడువఁ బెరుమాళ్లసేవ యనిన ట్లీపారావారము నీసైన్యంబులతో దాటునుపాయంబు మున్ముం దాలోచింపుఁడు.

శ్రీరా:-(పరిసరదర్భాసనమున నుదీచీశిరముగాఁ బ్రాఙ్ముఖుఁడై పరుండి)
ఈసాగరుఁడు నే నెంత వేడినను ద్రోవ యొసంగకున్నాఁడు. మూర్ఖులపట్ల దండనీతిదక్క నన్యములు కార్యకారులు కావు. లక్ష్మణా ! ధను విటు దెమ్ము.

లక్ష్మ:- చిత్తము. (అందించును)

శ్రీరా:- (లేచి బొమలు ముడివేసి విల్లు నాకర్ణాంతము లాగి)

శా. సాహంకారత నెంత వేడుకొనిన న్జాల్మక్రియ న్ద్రోవ నీ
నూహింపం డిసుమంత వీనిని మదీయోగ్రాస్త్రకీలాళిచే
ద్రోహి న్శోషిలఁజేతు నంతకు నసాధ్యం బైన బ్రహ్మాస్త్రమే
యాహీనాత్ముని గ్రొవ్వడంచఁగల దిం కెన్నాళ్ళు శాంతించుటల్ ?

(అస్త్రప్రయోగము నటించును)

లక్ష్మ:- అగ్రజా ! సముద్రమంతయుఁ బాగ లెగయుచున్నది. వారిచరములెల్ల నల్లటల్లటపడి శోషిల్లినవి. కరుణాసముద్రుఁడవే. పోషితదీనసత్త్వుఁడవై కరుణింపుమా.

శ్రీరా:- అనుజా ! ఇంతసంక్షోభము వాటిల్లుచున్నను వీఁడు త్రోవ నీకున్నాఁడు.

గీ. ఆదరము లేక తరతమ మరయ లేక
వెంటనే కానుపింపని విరసు నిపుడె
రంగ దజసాయకంబునఁ బొంగడంచి
స్వామి భక్తుల కృతికి వే సాయమగుదు.

ఏమి యీజడధిపొగరు ! (బ్రహ్మశిర మభిమంత్రించుట నటించి) అమ్మా ! బ్రహ్మశిరమా !

గీ. త్రాగుఁబోతువిధాన, నాదనుజ్ఞఁ బతిఁ
ద్రోవ నీకుండుజలనిధి దూటి యల్ల
కలశజునిరీతిఁ గ్రోలి యీకపిచయంబు
పోవఁగా మార్గదర్శివై పోదుగాక.

(అని బాణాసనమున సంధించి యాకర్ణాంతము లాగును)

లక్ష్మ:-అగ్రజా! శాంతింపుము. శాంతింపుము. మీక్రోధమునకు జడిసి చెలియలికట్ట కొకయోజనము లోని కేగె. అదుగో సముద్రుఁడు సాకారుఁడై పరువున నెదురువచ్చుచున్నాఁడు.

సాగ:- పాహి మాం. పాహి మాం. శరణాగతరక్షకా ! రఘుకులదీపా ! నీవె యిట్లాగ్రహపడిన నెట్లు ? సర్వభూతములు నైసర్గికగుణము మానఁగలవా ? అట్లే యీనీరరాశి స్వగుణముఁ ద్రోచి యెట్లు త్రోవ నీఁగలదు ? మీసైన్యమున విశ్వకర్మకుమారుఁడు నలుఁడు కలఁడు. అతఁడు జనకవరానురూపముగ దృఢపిండిలము బంధింపఁ గలఁడు. అట్లొనర్ప నాజ్ఞయిండు. నాయందలిసత్త్వములు దాని కపాయముచేయకుండ నే కాపాడుచుండెద.

శ్రీరా:- సాగరా ! అట్లే యగుఁగాక. ఈబ్రహ్మాస్త్రము వ్యర్థమౌవు నది గాదు. ఏదేని లక్ష్యమునుఁ జూపుము.

సాగ:- మహాత్మా ! దీనిని ద్రుమకుల్యముపైఁ బ్రయోగించి నా కాదస్యులబాధఁ దప్పింపుము.

శ్రీరా:- అట్లే కానిమ్ము. (అని యస్త్రమును వదలుచు) సాగరా ! నీకు మఱేదేని వాంఛ కలదా ?

సాగ:- దేవరయనుగ్రహమున నా కేమి కొఱఁత ?

శ్రీరా:- అయిన నిర్గుఁగాక.

భ ర త వా క్య ము.

గీ. రాజ్యపదమున ననుజన రాఘవుఁబుఁ
గూర్చి మ్రొక్కుదురుగాక భూమిపతులు
నిక్కమే సుఖ మొందఁగాక ప్రజ లెపుడు
కవులు రాజసన్మానముఁ గాంతురు గాక.

—♦ గ ద్య. ♦—

ఇది శ్రీరామచంద్రనిర్వ్యాజకరుణాసాదితకవితావిరాజమాన హరిత
సగోత్రోద్భవాపస్తంబసూత్ర ఆదిశాఖాధ్యాయిః పారావారరాకా
సుధాకర కేశవాచార్యపౌత్ర వేంకటరామానుజాచార్యాండాళాం
బాప్రియపుత్ర శ్రీరామచంద్రపాదారవిందేందిందిరాయ
మాణమానస శ్రీవైష్ణవపాదరేణు విబుధ
మిత్ర వేంకటరంగస్వామికవి ప్రణీత
శ్రీ రా మో ద్యో గ ము
సంపూర్ణము.



గుంటూరు, చంద్రికాముద్రాశాలయందు ముద్రితము.

## [illegible] గారి రచియించిన

## ఇతర గ్రంథములు.

[illegible]

1. సింగరాద్రిమాహాత్మ్యము - గీతకావ్యము — 0- 4-
2. శ్రీరామబాల్యము - పురాణనాటకము — 0-12-
3. శ్రీరామప్రవాసము ,, — 1- 4-

[ అచ్చుకానున్నవి ]

4. శ్రీరామవిజయము ,,
5. శ్రీరామప్రస్థానము ,,
6. [illegible]సింహా (రాయచూరుయుద్ధము) చరిత్రాత్మకనాటకము.

వలయువారు:

1. ఆదూరి వేంకటరంగస్వామి అయ్యంగారు,
శ్రీరామానుజభవనమ్,
కోర్టువీధి - ఒంగోలు.

2. పి. వి. రమణయ్య అండ్ సన్,
అరండల్ పేట - గుంటూరు.

